


Presents

# Folk Tales of India













**An exclusive collection from the land of stories.
Stories popularly circulated among the peope of the four regions of our country.
A compendium worth preserving.
Rs. 50 each**

Available soon in leading bookstores!



Chandamama India Ltd., JVL Plaza, 6th Floor, 626 Anna Salai, Teynampet, Chennai - 600 018







బాటా స్కూల్ ప్రాడక్ట్స్ కొనండి

# మీతో బెన్10ను
# స్కూలుకు తీసుకువెళ్ళండి





మీ కొనుగోలు మీద
ఒక బెన్10 సిప్పర్‌ను*
కేవలం 25 రూ. లకే
పొందండి



*Original MRP of sipper is Rs. 79/-. Offer valid till stocks last Bata school shoes available without this offer also.

* Terms and Conditions Apply.

To win more BEN10 Goodies SMS Bata CM <space> Name <space> Age to 58888

**Bata**
**SCHOOL SHOES**

CARTOON NETWORK

TM & © Cartoon Network.
(s08)



చందమామ సంపుటి: 60 మే 2008 సంచిక:05

## ఈ నెల విశేషాలుమ













## ఈ సంచికలో...





వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

మీ అభిమాన
చందమామ కథలు
ప్రస్తుతం
chandamama.com/
telugu
వెబ్‌సైట్‌లో
వస్తున్నాయి.
లాగ్ ఆన్ చేసి చదివి
ఆనందించండి!
-సం.



# వన్యప్రాణుల పరిరక్షణ

**1900** ప్రారంభంలో మన అరణ్యాలలో దాదాపు 40,000 పులులు ఉండేవి. అయితే, 1972 లెక్కల ప్రకారం వీటి సంఖ్య 1,827కు దారుణంగా పడిపోయినట్టు తెలియవచ్చింది. అప్పుడే వన్యప్రాణుల పరిరక్షణచట్టం అమలులోకి వచ్చింది. 1973లో పులిని భారతజాతీయ మృగంగా ప్రకటించడం జరిగింది. పులులు అంతరించి పోకుండా 'ప్రాజెక్ట్ టైగర్' పథకం ప్రారంభించబడింది.

వన్యప్రాణులను, ముఖ్యంగా అంతరించిపోయే అపాయాన్ని ఎదుర్కొంటూన్న వన్య మృగాలను రక్షించడానికే 'ప్రాజెక్ట్ టైగర్' పథకం ఉద్దేశించ బడింది. అసలు అడవి జంతువులు ఎందుకు అంతరించి పోతాయి? మనుషులు దొంగతనంగా, విచక్షణా రహితంగా వేటాడ్డం మొదటి కారణం. వన్యప్రాణుల పరిరక్షణచట్టం అమలులోకి వచ్చాక జంతువుల వేట నిషేధించ బడింది. అయినా, చాటు మాటుగా వేటాడ్డం కొనసాగుతూనే ఉన్నది. అడవుల గుండా ప్రవహించే నదీజలాలు ఇటీవలి కాలంలో కలుషితమవుతున్నాయి. ఆ నీటిని తాగడంవల్ల జంతువులు అనారోగ్యానికి లోనై ప్రాణాలు కోల్పోతున్నాయి. ఇక రోజురోజుకూ పెరిగిపోతూన్న జనాభా కారణంగా-నివాసాలకూ, వ్యవసాయ భూములకూ, పరిశ్రమలకూ మరింత భూమి కాలసిరావడంతో అడవుల నిర్మూలన యథేచ్ఛగా సాగిపోతున్నది. దాంతో వన్యమృగాలు సహజ నివాసాలు కోల్పోయి సమీపంలోని పల్లెలూ, పట్టణాల కేసి రావడం; మనుషుల చేత చిక్కి ప్రాణాలు కోల్పోవడం జరుగుతున్నది.

అయితే, ఒక్కోసారి అలాంటి మృగాలను చంపకుండా సంబంధిత అధికారులకు తెలియ జేసి, వాటిని పట్టి మళ్ళీ అడవులకూ, అభయారణ్యాలకూ పంపడం అప్పుడప్పుడు జరగడం మనం వార్తలుగా చదువుతూంటాం. ఇది కాస్త ఊరట కలిగించే విషయం.

ఏది ఏమైనా వన్యమృగాలకు ప్రధాన శత్రువులు మనుషులే అన్నది నిర్వివాద అంశం. అయితే, ఈ భూమి మీది మానవజాతి మనుగడ అటవీ సంపద మీద అంటే అక్కడి చెట్టు చేమల మీదా, జంతువుల మీదా ఆధారపడి ఉందన్న ప్రాథమిక సత్యాన్ని ప్రతి ఒక్కరూ గ్రహించి, దానికి అనుగుణంగా నడుచుకోవడం చాలా అవసరం.

సంపాదకుడు : **విశ్వం**





చందమామ

***Editor, Publisher :*** B. Viswanatha Reddi (Viswam)
***Chief Executive Officer :*** L. Subramanyan
***Editorial Advisors :*** Ruskin Bond, Manoj Das
***Consultant Editor :*** K. Ramakrishnan
***Associate Editor :*** A.R. Balasubrahmanyam
***Artists:*** K.C. Sivasankaran (Sankar)
Gandhi Ayya, P. Mahesh
***Layout Design:*** R. Sudha
***Assistants:*** D. Revathy, B.A. Hemalata Malini
***Research :*** R. Vaasugi

***CIRCULATION TEAM :***
***Chennai : T N Ravi Shankar, National Sales Manager***
Mobile +91 99620 70014
email: ravishankar.tn@chandamama.com
**Fazal Khan, *Manager-Circulation & Institutional Sales***
Mobile +91 99625 67860
email: fazal.khan@chandamama.com
***Mumbai : Rajendra K Jadhav, Asst. Manager - Circulation***
Mobile +91 9271720669
**CHANDAMAMA INDIA LTD.**, B-3, Lunic Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email: rajendra.jadhav@chandamama.com
***New Delhi : Sushil Sharma, Circulation Manager-North***
Mobile +91 98719 30767
**CHANDAMAMA INDIA LTD.**, Goyal Business Centre,
C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
***Bangalore : P. Murali, Asst. Circulation Manager -Karnataka***
Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.**, 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
***Kolkata : Ananth Prakash, Circulation Manager-East***
Mobile +91 98351 82202
email : ananth.prakash@chandamama.com
***Advertisement :*** email : sales@chandamama.com
***Online and Interactive : Surajit Agarwal***
Mobile +91 99620 70015
email: surajit.agarwal@chandamama.com
***Head Office : CHANDAMAMA INDIA LTD.,***
JVL Plaza, Block-A, 6th Floor, 626, Anna Salai, Teynampet
CHENNAI-600018, Phone +91 44 2432 2101/02,
Fax +91 44 2432 2103
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

చందా

ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.**180.00**
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ,
మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ
ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.

# పాఠకుల లేఖలు

### రూ. 250/– బహుమతి పొందిన లేఖ

మార్చ్ సంచిక మనోరంజకం అనుట అతిశయోక్తి కానేరదు. ధైర్యం వున్నచోటనే తెలివితేటలు రాణిస్తాయని విజయచంద్రుడి పాత్ర ద్వారా 'నేత్రసంజీవని' కథ చక్కగా ఋజువుచేసింది. కాలాన్ని అనవసర వాచాలతతో వృథా చేసుకోకుండా సద్వినియోగపరచుకోమని 'అర్ధరాత్రి' కథ ప్రబోధించింది. ఏ ప్రయత్నం చేయక మూర్ఖంగా దేవుడిపై భారం వేయటం తగదని 'దేవుడికి అవకాశం' కథ హెచ్చరించిన తీరు అభినందనీయం! పదవిని వారసత్వంగాగాక స్వశక్తితో సంపాదించటమే సమర్థత అని 'రాజుగారి పోటీలు' కథ ద్వారా స్ఫురింపచేసిన తీరు ఆలోచనీయం! ప్రపంచ జలదినోత్సవ సందర్భంగా నీటి ఎద్దడి సమస్యాపరిష్కారాన్ని విశ్లేషించిన 'సందేశాత్మక సంపాదకీయం' ఈ నెల చందమామకు ప్రత్యేకతను సంతరింపచేసింది. 'తరతరాల ఒలింపిక్స్' శీర్షిక ద్వారా మాకు తెలియని 'ఒలింపిక్స్' పుట్టుపూర్వోత్తరాలను తెలుసుకున్నాం. పాఠకులు పాల్గొనే మరికొన్ని శీర్షికలను, సందర్భోచిత 'కార్టూన్స్'ను, ఆయా నెలల్లో వచ్చే జాతీయ, అంతర్జాతీయ దినోత్సవాల ప్రాధాన్యత తెలియచేసే శీర్షికను ప్రవేశపెట్టగలరని అభిలషిస్తున్నాను. –తోటపల్లి సుధీర, వాకాడు – **524 415**

మార్చ్ చందమామలో నాకు బాగా నచ్చిన కథ తండ్రికి గుణపాఠం నేర్పిన 'పితృద్రోహి' కథ! 'తరగని నిధి' నిజమైన నిధి జ్ఞానమేనని చాటి చెప్పిన కథ, ప్రపంచంలోకెల్లా చాలా అందమైన స్త్రీ 'అమ్మ' అని హరీంద్రనాథ్ గారు చెప్పిన తీరు అద్భుతం. ఇహపోతే రాకాసిలోయ, రామాయణం, అజేయుడు గరుడుడు, బేతాళకథ పత్రికకు వన్నె తెచ్చాయి. బాలల కథలు, కవితలు, సామెత కథలు ప్రవేశపెడితే పత్రిక మరింత వెరైటీగా ఉంటుందనడంలో సందేహం లేదు. –వూకాటి ప్రవీణ,
పొదలకూరు, నెల్లూరు జిల్లా – **524 645**




# గొప్పింటల్లుడు

మనోహరుడు చూడడానికి చక్కగా ఉంటాడు. అంతో ఇంతో చదువుకున్నాడు. మాధవితో అతడి పెళ్ళి జరిపించాలని తల్లిదండ్రులనుకున్నారు. చిన్నప్పటి నుంచీ తెలిసిన మాధవి అంటే మనోహరుడికి ఇష్టమే. అతడా విషయం మాధవితో పలుమార్లు చెప్పి ఉన్నాడు.

ఒక రోజున జ్యోతిష్కుడొకడు మనోహరుడి చెయ్యి చూసి, ''త్వరలోనే గొప్పింటల్లుడివవుతావు,'' అన్నాడు. డబ్బు మీద మోజున్న మనోహరుడికా మాట బాగా తలకెక్కింది. అంతగా డబ్బు లేని మాధవిని పెళ్ళాడాలా, వద్దా అని సందిగ్ధంలో పడితే, ''గొప్పింటి అల్లుడివి కావడానికి మొదట నువ్వు గొప్పవాడివికావాలి. మాధవే నీకు సరిజోడు. జ్యోతిష్కులు చెప్పే కల్లబొల్లి కబుర్లు నమ్మి, లేనిపోని ఆశలు పెట్టుకోకు,'' అని మందలించారు తల్లిదండ్రులు.

ఆ మరునాడే ఆ ఊళ్ళో పాతికెకరాల పొలమున్న మోతుబరి రామస్వామి వాళ్ళింటికి వచ్చాడు. తనకు మనోహరుడు నచ్చాడనీ, తన కూతురు కల్పనను పెళ్ళాడితే మూడెకరాల భూమి కానుకగా ఇస్తాననీ చెప్పాడు. మనోహరుడికి జ్యోతిష్కుడి మాట మీద గురి కుదిరి కల్పనను పెళ్ళాడాలనుకున్నాడు.

ఆ విషయం మాధవికి తెలిసి బాధపడింది. ఆ రోజు సాయంకాలం గ్రామదేవత గుడివద్ద కనిపించిన మనోహరుణ్ణి, ''కట్నం ఆశకులోనై చిన్నప్పటి నుంచి ఇష్టపడిన నన్ను కాదనడం న్యాయమా?'' అని అడిగింది.

''చిన్నప్పటి నుంచి నిన్ను నేను ఇష్టపడ్డానా? అసలే నీకు పిల్లికళ్ళు. నాకు కల్పన అందం ఎంతో నచ్చింది. అందుకే ఆమెను పెళ్ళాడాలనుకుంటున్నాను,'' అన్నాడు మనోహరుడు బింకంగా.

''వసుంధర''



మాధవికి ఉ(క్రోషమొచ్చి, ''కల్పన తం(డ్రి మూడెకరాల పొలం కట్నమిస్తాననేసరికి నావి పిల్లికళ్ళయి పోయాయా? నన్నిలా అన్నం దుకు నా ఉసురు తగిలి వచ్చే జన్మలో నువ్వు పిల్లివై పోతావులే,'' అంటూ విసురుగా వెళ్ళి పోయింది.

మనోహరుడు తల్లిదం(డులకు జరిగింది చెప్పాడు. ఇక మాధవి అడ్డు లేదని (గ్రహించి అతడి తం(డ్రి వెంటనే పురోహితుణ్ణి సం(ప్ర దించి కల్పనతో నిశ్చితార్థానికి ముహూర్తం పెట్టించాడు.

నిశ్చితార్థం రేపనగా వాళ్ళ దూరపు బంధువు రంగస్వామి సకుటుంబంగా ఏదో పని మీద ఆ ఊరొచ్చి వాళ్ళింట్లో బస చేశాడు. ఆయన చాలా కాలంగా రాజధానిలో రాజు కొలువులో చిన్న ఉద్యోగం చేస్తున్నాడు. ఆయన, భార్య మనోహరుణ్ణి చూసి, తమ కూతురు వందనకు ఈడూజోడూగా ఉంటాడని ముచ్చటపడి అతడి తల్లిదం(డులకు చెప్పారు.

మనోహరుడి తల్లిదం(డులు మరునాడే అతడికి కల్పనతో నిశ్చితార్థమని చెబితే రంగస్వామి, ''అంతా విన్నాంలే. చిన్నప్పటి నుంచీ అనుకున్న మాధవినే కాదన్నారు. ఇంకా నిశ్చితార్థమైనా కాని కల్పన గురించి ఆలోచన ఎందుకు? రామస్వామి మీకు మూడెకరాలు ఇస్తానన్నాడు కదా? పొలం ఎంతున్నా కష్టపడితే తప్ప ఫలసాయమం దదు. పైగా సకాలంలో వర్షాలు కురవాలి. వరద ముంపు లేకుండా ఉండాలి. నేను మనోహరుడికి రాజుగారి ఆస్థానంలో ఉద్యోగ మిప్పిస్తాను. వానొచ్చినా, వరదొచ్చినా జీతబత్తా లకు లోటుండదు. (శమ తక్కువ, సుఖం ఎక్కువ. బోలెడు పలుకుబడి. ఆలోచించి చూడండి,'' అంటూ ఆశపెట్టాడు.

మనోహరుడి తల్లిదం(డులు సందిగ్ధంలో పడ్డారు. కాని జ్యోతిష్కుడి మాట మీద మరింత గురి కుదిరిన మనోహరుడు, వంద నను పెళ్ళిచేసుకోవాలనే నిర్ణయానికి వచ్చాడు. ఈ విషయం తెలిసిన కల్పన మనోహరుడి ఇంటికి వచ్చి, వందనను కలుసుకుని, ''చిన్నప్పటి నుంచీ అనుకున్న మాధవిని కూడా కాదని మనోహరుడు నన్ను ఇష్టపడ్డాడు. ఉద్యోగం ఎర చూపి మా ఇద్దరినీ వేరు చేయడం తగదు,'' అన్నది.

వందన, ''ఉద్యోగం వస్తుందనే నన్ను చేసు కుంటున్నావా?'' అని మనోహరుణ్ణి అడిగింది.

"అదేం కాదు. కల్పన చూడ్డానికి అందంగా ఉంటుందేగాని, విన్నావుగా ఆమె పౌరుషం తీరు. దెబ్బ తిన్న కుక్క మొరిగినట్టు. అది నాకు నచ్చలేదు. నువ్వు నచ్చావు. అందుకే నిన్ను పెళ్ళాడాలనుకుంటున్నాను," అన్నాడు మనోహరుడు.

కల్పనకు ఉక్రోషమొచ్చి, "వందన తండ్రి రాజాస్థానంలో ఉద్యోగమిప్పిస్తాననే సరికి నా మాట కుక్క మొరుగైపోయిందా? నన్నిలా అన్నందుకు నా ఉసురు తగిలి నువ్వు వచ్చే జన్మలో కుక్కగా పుడతావులే," అని చెప్పి వెళ్ళిపోయింది.

జరిగింది విన్న మనోహరుడి తల్లి, "నీ పెళ్ళి నీ ఇష్టం కానీ, అందుకు కన్నెపిల్లల ఉసురు పోసుకుంటున్నావు. ఇది సరైన పద్ధతి కాదురా," అని కొడుకును బాధతో మందలించింది.

మనోహరుడు నవ్వి, "అవతల రాజా లాంటి జీవితం నాకోసం కాచుకుని ఉంది. వీళ్ళ శాపాలు నన్నేం చేస్తాయిలే," అన్నాడు.

ఆ తరవాత రంగస్వామి వందనకూ, మనోహరుడికీ నిశ్చితార్థం చేసుకుందామన్నాడు. అయితే, మనోహరుడి తల్లిదండ్రులు నిశ్చితార్థం అవసరం లేదన్నారు. కొడుక్కు రాజు కొలువులో ఉద్యోగం దొరికిన వెంటనే, వాళ్ళిద్దరికీ పెళ్ళి జరిపించేద్దామన్నారు. రంగస్వామి సరేనని మనోహరుణ్ణి తనతో రాజధానికి తీసుకువెళ్ళాడు.

రాజుకొలువులో రంగస్వామిది చిన్న ఉద్యోగమే అయినా అతనికి రాజధానిలో పెద్ద పెద్ద



వాళ్ళ పరిచయాలు ఉన్నాయి. అలా పరిచయమైన వారిలో అక్కడి ప్రముఖ వ్యాపారి రత్నస్వామి ఒకడు. రంగస్వామి మనోహరుణ్ణి ఆయన వద్దకు తీసుకువెళ్ళి సంగతి చెప్పి, "మీరు రాజుకు సిఫారసు చేసి ఇతనికి ఆస్థానంలో కొలువు ఇప్పించండి. నా కూతురొక ఇంటిదైతే కలకాలం మీ పేరు చెప్పుకుంటాం," అన్నాడు.

మనోహరుడి వివరాలు విన్నాక రత్నస్వామికి అతన్ని తన అల్లుడిగా ఎందుకు చేసుకోకూడదు అనిపించింది. ఆయన కూతురు జలజ కూడా మనోహరుడి రూపం చూసి మురిసిపోయి అతన్ని పెళ్ళాడడానికి ఒప్పుకున్నది.

రత్నస్వామి పెళ్ళి మాటెత్తగానే జ్యోతిష్కుడి మాట ఇప్పటికి నిజంగా నిజమయిం

దని భావించిన మనోహరుడు వెంటనే ఒప్పుకున్నాడు.

ఈ విషయం తెలిసిన వందన జలజను కలుసుకుని, ''చిన్నప్పటి నుంచీ అనుకున్న మాధవినీ, ఏరి కోరి వచ్చిన కల్పననూ కాదని నన్ను ఇష్టపడ్డాడు మనోహరుడు. ఐశ్వర్యం ఎర చూపి మా ఇద్దరినీ వేరు చేయడం నీకు తగదు,'' అన్నది.

జలజ వెంటనే మనోహరుణ్ణి పిలిపించి, ''ఎందరినో కాదని ఇష్టపడ్డ వందనను కాదని నన్ను పెళ్ళి చేసుకునేందుకు నా ఐశ్వర్యమే కారణమా?'' అని అడిగింది.

''కాదు కాదు. నాకు సంగీతమంటే ఇష్టం. వందన పాడడానికి గళమెత్తితే గార్దభస్వరమే. చక్కగా పాడే నువ్వు నాకు నచ్చావు. అందుకే నిన్ను పెళ్ళాడాలనుకుంటున్నాను,'' అన్నాడు మనోహరుడు.

వందన పట్టరాని కోపంతో, ''జలజ ఐశ్వర్యం చూసేసరికి నాది గార్దభ స్వరమై పోయిందా? నన్నిలా అన్నందుకు నా ఉసురు తగిలి నువ్వు వచ్చే జన్మలో గాడిదవై పుడతావులే!'' అంటూ అక్కడి నుంచి వెళ్ళి పోయింది.

ఆ తరవాతి ముహూర్తంలో జలజకూ, మనోహరుడికీ వైభవంగా వివాహం జరిగి పోయింది. పెళ్ళయిన వారానికి రత్నస్వామిని సాటి వ్యాపారి ఒకడు, ''ఏమయ్యా, నీ కూతురికి ఎక్కడా సంబంధం దొరకనట్టు లేనివాడికిచ్చి చేశావు?'' అని అడిగాడు. అందుకు రత్నస్వామి నవ్వుతూ, ''నా కూతురికి కోపమెక్కువ. లేనివాణ్ణి చేసుకుంటే పిల్లిలా పడివుంటాడు. నాకు సంపదలెక్కువ. లేనివాడు అల్లుడైతే కుక్కలా కాపలా కాస్తాడు. మా ఇంటికి చాకిరి ఎక్కువ. లేనివాడైతే గాడిదలా చాకిరి చేస్తాడు. అదీ రహస్యం. తెలిసిందా?'' అన్నాడు.

ఆ మాటలు మనోహరుడి చెవిన పడ్డాయి. గొప్పింట్లో తన స్థానమేమిటో, ధనాశ తనకు ఎంతటి ఆత్మగౌరవం లేని బతుకునిచ్చిందో, ముగ్గురు కన్నెపిల్లల ఉసురు పైజన్మలకు కాక, ఈ జన్మలోనే ఎలా తగిలిందో గ్రహించి విచారంగా నిట్టూర్చాడు.



CHANDAMAMA CLASSICS and COMICS

Arya

# Spend this summer with your favourite Companions

Follow the adventures of the unknown **Prince Arya** with his forest friends.
Read the **legend of Garuda**, the invincible warrior.
Solve mysteries in the jungle with super sleuths, **Eli and Puli**, of the Detective Duo intelligence agency.

Garuda

Get your copies NOW!

Rs. 40

ARYA

Rs. 60

Garuda

Rs. 50

Eli & Puli

**Chandamama subscribers buying all three titles will get a 20% discount**

Available with vendors and leading bookstores.

# చెరిసగం!

కొండయ్య బండి నుంచి బియ్యం బస్తాలను ఒక్కొక్కటిగా వీపు మీదికెత్తుకుని దుకాణం లోకి చేరుస్తున్నాడు. ఒక బస్తా పట్టు తప్పి కిందపడి బియ్యం చెల్లా చెదరయ్యింది. బియ్యాన్ని మళ్ళీ బస్తాలోకి నింపి, పైకెత్తుకోబోయి, ఎత్తలేక కష్టపడసాగాడు. దానిని గమనించిన దుకాణం యజమాని రంగనాథం, ''ముసలోడివైపోయావు కొండయ్యా. ఇక బస్తాలు మోయడం నీవల్ల కాదు. రేపటి నుంచి పనికిరావద్దు. గంగణ్ణి రమ్మన్నాను,'' అన్నాడు.

''పనిలేక పోతే, భార్యాబిడ్డలను ఎలా పోషించేది? ఇన్నాళ్ళు పనిచేశాను. ఏదైనా చిల్లరమల్లర పనులైనా ఇవ్వండి బాబూ,'' అని ప్రాధేయపడ్డాడు కొండయ్య.

''ఈ వయసులో ఇంకా ఏం పనిచేస్తావు? కృష్ణా రామా అనుకుంటూ ఇంటి దగ్గర కూర్చో,'' అంటూ వెళ్ళిపోయాడు రంగనాథం.

లోకమే చీకటైపోయినట్టు, ''ఏం చెయ్యను దేవుడా!'' అనుకుంటూ ఇల్లుచేరిన కొండయ్య భార్య ముత్యాలమ్మకు జరిగింది చెప్పి కళ్ళనీళ్ళపర్యంతమై పోయాడు.

''దీనికే ఎందుకిలా ఏడుస్తావు? అయినా, ఇంకా ఎన్నాళ్ళని ఒళ్ళు హూనం చేసుకుంటావు. శక్తి ఉన్నన్నాళ్ళు నువ్వు మమ్మల్ని కాపాడావు. ఈరోజు నుంచి మనం కలిసి కష్టపడి బతుకుదాం,'' అన్నది భార్య. ''ఎలా ముత్యాలూ?'' అని అడిగాడు కొండయ్య కన్నీళ్ళు తుడుచుకుంటూ.

''నువ్వు తెచ్చిన కూలీ డబ్బుల్లో రోజూ కొంత పొదుపు చేశాను. ఇప్పుడు నూరు వరహాలు చేరాయి. దాంతో ఒక బడ్డీ కొట్టు పెట్టుకుంటే మన బతుకు బండి సాగిపోతుంది. మరేం భయపడకు,'' అన్నది భార్య భర్తను ఓదారుస్తూ.

కొండయ్యకు ఆ మాటలు తను మొక్కే దేవత పలుకుల్లా వినిపించాయి. రోజుగడిస్తే చాలను కున్న తనలా కాకుండా, ముందు చూపుతో తన భార్య చేసిన పొదుపు తమకిప్పుడు ఉపయోగ పడడం అతడికెంతో ఊరట కలిగించింది.

– మాదుగుండు కృష్ణ






# రాకాసిలోయ

## 33

[కేశవుడూ అతడి అనుచరుల్ని, గణాచారి ముఠావాళ్ళు పట్టుకోచూశారు. కాని, వాళ్ళు రాత్రివేళ వాళ్ళ కనుగప్పి, కొండశిఖరం చేరారు. అవతల, వాళ్ళకు ఒక భయంకరమైన లోయ కనిపించింది. వాళ్ళు అడవితీగ నొకదాన్ని పట్టుకుని లోయలోకి దిగుతున్నంతలో, గణాచారి ముఠావాళ్ళు వచ్చి, వాళ్ళను కింద పడిపోయేలా చేయడానికి రాళ్ళతో తీగను నరికి వేయసాగారు. -తరవాత]

తమకు ఆధారంగా వున్న అడవితీగను పైన నరికివేస్తున్న శబ్దం వింటూనే కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్ భయంతో కంపించి పోయారు. మరుక్షణమే తేరుకున్న కేశవుడు, ''ఇన్ని కష్టాలు దాటి, ఇంత దూరం వచ్చి, ఇక్కడ చావబోతున్నామంటేనేను నమ్మను,'' అన్నాడు నిండు కంఠంతో.

''నీ వన్నది నిజం, కేశవా! నా కాలికేదో పట్టు చిక్కింది. మీరు తీగ మీద నుంచి సాధ్యమైనంత బరువు తగ్గించి, చేతి పట్టుకేమైనా దొరుకుతుందేమో చూడండి. వీలయితే, మనం తీగను ఏ రాతికన్నా ముడి వేయటం మంచిది. అప్పుడు, పైన తెగినా, మనం ఒక్కసారిగా లోయలోకి పడిపోం,'' అన్నాడు జయమల్లు.

జయమల్లు మాట ముగించే లోపలే, ముగ్గురిలో పైనున్న కోయగోమాంగ్, ''ఆ దుర్మార్గులు తీగనరికేశారు!'' అంటూ ఒక్క

'చందమామ'



సారిగా అరిచి, తలకిందులై పోయాడు. అతడితో పాటు కేశవుడూ, జయమల్లూ కూడా పట్టు తప్పి, గాలిలో ఒకటి రెండు పల్లటీలు కొట్టారు. కాని, వాళ్ళల్లో ఎవరూ తమ చేతిలో వున్న అడవి తీగను విడిచి పెట్టలేదు. ఆ జాగర్తే వాళ్ళను కాపాడింది. కను మూసి తెరిచేంత వ్యవధిలో వాళ్ళు తిరిగి రాళ్ళ కేసి గుంజబడ్డారు.

''తెగ నరకబడిన అడవితీగ మన అదృష్టం కొందికీ, దిగువను ఏ రాయినో చుట్టుకుని బిగుసుకుపోయింది,'' అన్నాడు జయమల్లు.

కేశవుడూ, గోమాంగ్ ఏదో జవాబివ్వబోయేంతలో, కొండ శిఖరం మీది నుంచి గణాచారి ముఠా వాళ్ళు, ''ఆ దుష్టులు ఈసరికి కింది లోయలోని రాళ్ళ మీద పడి తునాతునియలై వుంటారు. మన పక్షిమాతల రెక్కలు నరుక్కు వెళ్ళే వాళ్ళందరికీ, ఇదే చావు రాసి పెట్టివున్నది,'' అంటూ కేకలు పెట్టారు.

ఆ కేకలకు లోయ అంతా ప్రతిధ్వనించింది. పెద్దపెద్ద చెట్ల మీద రెక్కలు చాచుకు నిలబడి వున్న గండభేరుండాలు గొంతులెత్తి కర్ణకఠోరంగా ఒక్కసారి అరిచినై. ఎక్కడో పులి ఒకటి రంకె వేసింది. అంతలో ఒక మానవ కంఠం లోయలో నుంచి విసుక్కుంటున్నట్టు కటువుగా పలికింది: ''కింకరా! ఏమిరా, ఆ రణగొణ ధ్వనులు? పులిరాజు కూడా మేల్కొన్నాడు!'' అన్నదా కంఠం.

ఆ వెంటనే జవాబుగా మరో గొంతు, ''జగభోజిగురో! ఆ గణాచారి సజ్జు ఎవర్నో చంపి రాకాసిలోయ లోకి తోసినట్టుంది. ఈ గత్తర కంతా అదే కారణం,'' అన్నది.

''ఆ చచ్చిన వాళ్ళు బ్రహ్మపురం రాజూ, వాడి గురువూ కాదుగదా?'' అన్నాడు జగభోజి.

''వాళ్ళా! వాళ్ళిక్కడికి దారి తెలుసుకుని వచ్చే లోపల, మనం రాకన్నెను పెళ్ళాడి, ధనరాసులతో కూడా అంతర్ధాన మవుతాం. వాళ్ళు ఈ లోయలోని గండభేరుండాలకూ, కొండచిలువలకూ, క్రూరమృగాలకూ ఆహారం కావలిసిందే!'' అన్నాడు కింకరుడు.

''ఆ, రాకన్నె! కింకరా, ఆ మాటే మరిచాను. అమావాస్య ఇంకా పదమూడు రోజులున్నది. ఆ రాత్రిగాని నాకు ఆ కన్నెతో లగ్నం కుదరదు. ఇప్పుడు లోయలో రేగిన గడబిడకి సుకుమారి అయిన ఆ అందాల హంస నిద్ర మేలుకుని కలవరపడుతున్నదేమో చూడు,'' అన్నాడు జగభోజి.



కింకరుడు పెద్దగా నవ్వినసవ్వడి అయింది. ఆ తరవాత వాడు పెద్దగా గొంతెత్తి, ''గురో, ఆ కన్నె... కల్పకవల్లి... అందాల హంస కాదు, భయంకర బెబ్బులి! తన తండ్రి బ్రహ్మపురం రాజూ, ఆయన గురువూ కలిసి వచ్చి తనను కాపాడగలరనే ఇంకా భ్రమిస్తున్నది. అందుకే మిమ్మల్ని చులకన చేసి మాట్లాడుతున్నది. ఆవిడి క్కాస్త, ఈ రాకాసి లోయ అంటే బెదురు పుట్టటం అవసరం, మీరలా ఊరుకోండి,'' అన్నాడు కింకరుడు.

లోయ కింది భాగం నుంచి వచ్చిన ఈ సంభాషణ అంతా విన్న కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్ ఆశ్చర్యంతో, భయంతో కంపించిపోయారు. జయమల్లు కంపిస్తున్న కంఠస్వరంతో మెల్లగా, ''విన్నావా, కేశవా?'' అని అడిగాడు.

''విన్నాను. మనకంటే ముందే ఇక్కడికి మాంత్రికుడో ఎవడో చేరినట్టున్నది. వాడి స్వాధీనంలో మన బ్రహ్మపురం రాజు కూతురు కల్పకవల్లి వున్నది. వాడు కూడా మనం వచ్చిన ధనరాసుల కోసమే ఇక్కడ కాపలా వేశాడు,'' అన్నాడు కేశవుడు.

జయమల్లు ఆలోచనలో పడ్డాడు. అదృష్ట వశాత్తూ, వాళ్ళకు కొంచెం దిగువగా కొండ అంచు నుంచి బయటికి పొడుచుకు వచ్చిన రాళ్ళు కొన్ని కనిపించినై. తీగ మీద నుంచి నిశ్శబ్దంగా వాటి మీదికి జారి ముగ్గురూ, చీకట్లో చుట్టూ చూస్తూ కూచున్నారు.

''మనం బ్రహ్మపురం వదిలి చాలాకాలమైంది. ఈ లోపల అక్కడ చాలా మార్పులు జరిగినట్టుంది. రాజకుమార్తె కల్పకవల్లి, ఈ రాకాసిలోయ ఎలా చేరింది? ఈ జగభోజి ఎవడు? మనం రాకుమారిని రక్షించగలమా, జయమల్లూ?'' అన్నాడు కేశవుడు.

జయమల్లు జగభోజికీ, కింకరుడికీ జరిగిన సంభాషణ వెనక వున్న రహస్యం ఏమిటో తెలుసుకునేందుకూ, 'పులిరాజు' అన్న జగభోజి మాటల అర్థం కనుక్కునేందుకూ ఆలోచిస్తున్నాడు.

''కేశవా! ఈ సంగతేమైనా నీకు గుర్తువున్నదా? మనం బ్రహ్మపురం దగ్గిర కొండల్లో వున్నప్పుడు, బ్రహ్మదండి మాంత్రికుడు కాలభైరవుణ్ణి నీ మీదికి ఆవాహన చేశాడు. అప్పుడు నువ్వు ఆ మైకంలో కొన్ని రహస్యాలు చెప్పావు. అవేమిటో తరవాత నేను నీకు చెప్పాను,'' అన్నాడు జయమల్లు.



కేశవుడు, ''ఆ గొడవేమీ నాకు అంతగా గుర్తు లేదు. ఈ రాకాసిలోయలో ధనరాసులున్న వన్న సంగతొక్కటే నాకు బాగా జ్ఞాపకం వున్న విషయం!'' అన్నాడు.

అప్పటి వరకూ వాళ్ళిద్దరి సంభాషణా వింటూ, నిశ్చేష్టుడై కూచుని వున్న కోయ గోమాంగ్, హఠాత్తుగా ప్రాణం వచ్చిన వాడిలా కేశవుడి కేసి తల తిప్పి, ''నా కళ్ళకు లోయ కావల ఎక్కడో దీపాల వెలుగు కనిపిస్తున్నది. చెవులకు ఏనుగులు ఘీంకరించిన ధ్వని వినబడుతున్నది,'' అన్నాడు.

''నా కలాంటి కాంతులు గాని, ధ్వనులు గాని వినిపించటం లేదు. నన్నేదో మత్తు ముంచేస్తున్నది. నాకీ రాకాసిలోయలోని బంగారమూ వద్దు, వెండీ వద్దు. ప్రాణం విసిగిపోయింది. చావంటే నాకేం భయం లేదు-కాని, చచ్చే ముందు ఒక్కసారైనా మా అయ్యను చూడగలిగితే, ఎంత బావుండును!'' అంటూ కేశవుడు కళ్ళు మూసుకుని, వెనక్కు చేరగిలబడిపోయాడు.

జయమల్లు కేశవుడి భుజం పట్టుకుని లాలిస్తూ, ''నిరుత్సాహపడకు, కేశవా! జగభోజి, వాడి శిష్యుడు కింకరుడి సంభాషణ విన్న తరవాత నాకు మన కష్టాలు తీరే సమయం ఆసన్నమయిందని నమ్మకం కలుగుతున్నది. మనం, నీ ముసలి తండ్రినే కాదు, బ్రహ్మపుర రాజునూ, రాజ గురువునూ-అందర్నీ చూడగలగవచ్చు. ఈ లోయలోని నిధులు మాత్రం మనవి. అవి సంపాయించే శక్తి మనకే వున్నది. వాటి మీది హక్కు కూడా మనదే,'' అన్నాడు.

''భవిష్యత్తు మన కనుకూలంగా వున్నదని, అంత నమ్మకంగా నువ్వెలా చెప్పగలవు?'' అని అడిగాడు కేశవుడు.

జయమల్లు, ''కాలభైరవుడు నిన్నావేశించినప్పుడు, నువ్వు బ్రహ్మదండి మాంత్రికుడితో అన్న మాటలివి: 'వింధ్యారణ్యాల కవతల ఒక గొప్ప కొండ లోయ వున్నది. అదే రాకాసి లోయ! ఆ లోయలో ఒక చోట ఎత్తయిన ఒక రావిచెట్టు, దాని కింద ఒక పాము పుట్ట... ఎండి మోడుగా వున్న చెట్టు వెన్నెల రాత్రి ఫలపుష్పాలతో నిండి పోతుంది... పులి రాజును చంపి, చర్మం వలిచి, దాన్ని...' ఆ తరవాత బ్రహ్మపుర రాజగురువు తన మంత్ర శక్తితో నీ నోరు కట్టేశాడు,'' అని చెప్పాడు.

''మనం రాకాసిలోయ చేరామన్న సత్యం ఒక్కటి తప్ప, తతిమ్మా మాటల్లో వున్న

నిజమెంతో ఇంత వరకూ సూచనగా నైనా బయటపడలేదు,'' అన్నాడు కేశవుడు నిస్పృహగా.

''కాలభైరవుడు ఆవేశించినప్పుడు, నువ్వు చెప్పిన ప్రతి అక్షరం నిజమై తీరుతుంది. ఇంతకు ముందు జగభోజి అన్న మాటల్లో 'పులిరాజుకూడా మేల్కున్నాడు!' అన్న పదం అర్థం ఏమిటి? మనం సూర్యోదయం కాగానే లోయలోకి దిగి, ఎలాగో ఆ పులిరాజును చంపబోతున్నాం. తరువాతదాని చర్మం వలిచి, దాన్ని...''

జయమల్లు మాట ముగించే లోపలే, వాళ్ళు కూర్చుని వున్న కొండరాళ్ళకు దిగువగా పెద్దపులి భయంకరంగా రంకె వేసింది. ఆ ధ్వని వింటూనే ముగ్గురూ తలలు వంచి కిందికి చూశారు. వాళ్ళకు నిప్పు రవ్వల్లా కణకణ లాడుతూ మెరుస్తున్న రెండు కళ్ళు లోయ అడుగున కనిపించినై.

''ఇదే పులిరాజు! ఆ మెరుస్తున్న కళ్ళు మనం చూడ గలుగుతున్నామంటే, అది మోర ఎత్తి, మనకేసే చూస్తున్నదన్న మాట!'' అన్నాడు కోయగోమాంగ్.

''మన నది గుర్తించింది, దాన్ని మనం గుర్తించాం, బావుంది! ఒకళ్ళ నొకళ్ళు చంపుకునేందుకు వెతుక్కోవలసిన శ్రమ తప్పింది. గోమాంగ్! నీ దగ్గిర విషం పూసిన అంబులు వున్నవి గదా?'' అన్నాడు జయమల్లు.

''ఉన్నవి. ఇప్పుడే పులి వేట ప్రారంభిద్దామంటావా, మల్లూ?'' అని అడిగాడు కోయ గోమాంగ్.



'వేటకు ఇది సరైన సమయం కాదు. ఈ చీకట్లో, మనం చంపిన పులిరాజును జగభోజి ఎత్తుకు పోవచ్చు. మనం దాన్ని కొంచెం రహస్యంగా చంపాలి. అది మనను విడిచి పారిపోతుందన్న భయం లేదు. మన వాసన పసి కట్టింది గనక, మనం దానికి గుర్తు; దాని మెరిసే కళ్ళు చూశాం కనక, మనకు అది గుర్తు. ఎవర్ని ఎవరు చంపి చర్మం ఒలుచుకోగలమో ఉదయం కాగానే చూద్దాం. ఆ తరవాత జగభోజి అంతుతేల్చాలి,'' అన్నాడు జయమల్లు నిబ్బరంగా. గోమాంగ్, జయమల్లులు సంభాషిస్తున్నంతసేపూ కేశవుడు నిశ్చలంగా కూచుని వున్నాడు. వాళ్ళిద్దరి సంభాషణా ఆగిపోగానే అతడు, జయమల్లు కేసి ఆశ్చర్యంగా చూస్తూ, ''మల్లూ, నాకేం మతిపోవటం లేదుగదా! మేలుకుని వుండే

కలలు కంటున్నానేమో అని భయంగా వున్నది. లోయ కావలి నుంచి ఏమిటా ధ్వనులు? వింతగా వుందే!'' అన్నాడు.

''నీకూ, ఏనుగుల ఘీంకారం లాటి ధ్వనులు వినబడుతున్నవా?'' అని ప్రశ్నించాడు జయమల్లు.

''ఏనుగులు చేసే ఘీంకారాలే కాదు, ఎక్కడో గంటల చప్పుడు కూడా వినబడుతున్నది. ఏమంటావ్, గోమాంగ్? నీ కలాటి ధ్వనులేమైనా వినబడుతున్నవా?'' అని అడిగాడు కేశవుడు.

''ఇదంతా ఏదో మాయలా వుంది. నాకు గంటలు మోగుతున్న ధ్వనే కాదు, గాలి మోసుకొస్తున్నట్టు ఏవో మాటలు కూడా వినబడుతున్నవి. నన్నడిగితే, ఇదంతా ఏదో మంత్ర ప్రభావం వల్ల మనకు కలుగుతున్న భ్రమ అంటాను,'' అన్నాడు గోమాంగ్.

కోయగోమాంగ్ మాటలు జయమల్లులో రకరకాల ఆలోచనల్ని రేకెత్తించినై. గోమాంగ్ అన్నట్టు ఈ రాకాసిలోయ అంతా మంత్రగ్రస్తమా? జగభోజి బ్రహ్మపుర రాజు కూతురు కల్పకవల్లిని, ఏవిధంగా ఇక్కడికి తీసుకు రాగలిగాడు? ఈ లోయలో నుంచి కాలు బయటికి పెట్టకుండానే, వాడా కార్యం సాధించాడా? జయమల్లు ఇలాంటి ప్రశ్నలకు సమాధానాల కోసం సతమత మవుతుంటే, కేశవుడు తన తండ్రి ఈ సమయంలో ఇక్కడ వుంటే, ఎంతో బావుండేదని ఆలోచిస్తున్నాడు. కోయగోమాంగ్ తమ నాయకుడైన గడేజంగ్ వస్తే, రాజకుమారి జగభోజి చెర నుంచి విముక్తురాలు కాగలదని యోచిస్తున్నాడు.

రాకాసిలోయకు ఈవలి వైపున ఆ ముగ్గురు మిత్రులూ ఎవరి ఆలోచనల్లో వారుండగా, లోయకు ఆవల నున్న మైదానంలో బ్రహ్మపురం రాజూ, రాజగురువూ సైన్యం మధ్య తమ కోసం నిర్మించబడిన డేరాల్లో కూచుని ముందు కర్తవ్యం గురించి చర్చలు జరుపుతున్నారు. వాళ్ళను పట్టుకున్న సమస్య: సైన్యంతో రాకాసిలోయ లోకి దిగటమా? లేక కొద్దిమంది అంగరక్షకుల్ని వెంట తీసుకుని లోయలోకి ప్రవేశించటమా? అన్నది. --(ఇంకావుంది)



# రాజ్యార్హత

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఎన్ని అవాంతరాలు ఎదురైనప్పటికీ సడలని నీ పట్టుదల బహుధా ప్రశంసనీయం. పాలకుడికి పట్టుదలతో పాటు శౌర్య పరాక్రమాలు ఎంత అవసరమో రాజువైన నీకు ప్రత్యే కంగా చెప్పవలసిన అవసరం లేదు. అయితే, కొందరి పక్షపాత వైఖరివల్లనో, అర్హతను నిర్ణయించడంలో తడబాటు కారణంగానో కొన్ని సందర్భాలలో అస లైన శౌర్య పరాక్రమాలు గుర్తింపు పొందకుండా మరుగున పడిపోతూ ఉంటాయి. నీకు తగుహెచ్చరికగా ఉండగలందులకు, అలా పక్ష

బేతాళ కథలు



పాత వైఖరితో వ్యవహరించిన ఒక గురువు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

సుప్రతీకం విస్తీర్ణంలో చిన్నదైనా సుసంపన్న రాజ్యం. పాలనాదక్షుడైన రాజు సుదక్షణుడి ఏలుబడిలో ప్రజలు సుఖసంతోషాలతో ప్రశాంతంగా జీవించేవారు. అయితే రాజుకు యాభైయేళ్ళు దాటినా సంతానం కలగక పోవడంతో ఆయన విచారగ్రస్తుడయ్యాడు.

రాజు ఒకనాడు మంత్రి గంగాధరుణ్ణి పిలిచి, ''మంత్రివర్యా, రాజ్యం వీరభోజ్యం కదా! నా తదనంతరం సింహాసనానికి తగిన వారసుడు లేకపోతే, ఈనాడు ఎంతో సన్నిహితంగా మెలుగుతూ, సగౌరవంగా సంబంధ బాంధవ్యాలు నెరుపుతూన్న ఇరుగు పొరుగు రాజులు కత్తులు దూయగలరు. అండలేని వారు అందరికీ చులకన అన్న మాట సామాన్యులకే కాదు; పాలకులకు కూడా వర్తిస్తుంది. నా తరవాత ఎవరు అన్న ప్రశ్న తరచూ నన్ను అశాంతికి గురిచేస్తోంది. బంధువుల్లో ఒకరిని దత్తత చేసుకుందామన్న రాణిగారి సూచన నాకు అంత సముచితంగా తోచడం లేదు. తగిన వారసుణ్ణి నియమించి, ప్రశాంతమైన ప్రజల జీవితానికి భద్రత కల్పించడం ఎలాగో తెలియడం లేదు,'' అన్నాడు నిట్టూరుస్తూ.

ఆ మాటలకు మంత్రి కొంతసేపు మౌనంగా ఆలోచించి, ''మహారాజా, తమ ఆవేదన సకారణమైనదే. ఆలోచించవలసినదే. ఇందుకు ఒక ఉపాయం తోస్తున్నది,'' అన్నాడు.

ఏమిటో చెప్పమన్నట్టు తలపంకించాడు రాజు.

''హరితవనంలోని విద్యాసాగరుడి గురుకులం గురించి తమకు తెలుసు కదా? అక్కడ పరాక్రమవంతులైన క్షత్రియ యువకులెందరో విద్యాభ్యాసం చేస్తూంటారు. మనం ఒకసారి ఆ గురుకులాశ్రమాన్ని సందర్శించి, ఈ విషయంలో విద్యాసాగరుడి సాయం తీసుకోవడం శ్రేయస్కరమని భావిస్తున్నాను,'' అన్నాడు మంత్రి గంగాధరుడు.

మరునాడే రాజు మంత్రిని వెంటబెట్టుకుని విద్యాసాగరుడి గురుకులాశ్రమానికి వెళ్ళి, ఆయనకు విషయం చెప్పాడు. గురువు వారికి తగుమర్యాదలు చేశాక, ''రాజా, తమరు మంచి సమయానికే వచ్చారు. విజయదశమి సందర్భంగా గురుకులంలో ఈ రోజు నుంచి మూడు రోజుల పాటు విద్యార్థుల మధ్య ప్రతిభా

పాటవాల పోటీలు జరుగనున్నాయి. కాబట్టి మీరు వాటిని స్వయంగా వీక్షించి తగిన నిర్ణయం తీసుకోవచ్చు,'' అన్నాడు.

ఆ తరవాత మూడు రోజుల పాటు జరిగిన పోటీలలో విలువిద్యలో ప్రతాపుడు, కత్తిసాములో ప్రచండుడు, మల్లయుద్ధంలో ప్రశాంతుడు గెలుపొందారు. ఈ ముగ్గురూ తక్కిన శాస్త్ర విద్యలలోనూ ఒకరికొకరు దీటుగా నిలిచినవారే.

ఆ ముగ్గురిలో రాజు కాదగినవాడెవరా అని రాజు ఆలోచిస్తూండగా గురువు, ''ఈ ముగ్గురికి మరొక్క పరీక్షకూడా పెట్టాలనుకుంటున్నాను. ప్రస్తుతానికి మీరు రాజధానికి వెళ్ళండి. నేను సమాచారం అందించగానే వచ్చారంటే మీ కోరిక తప్పక నెరవేరుతుంది,'' అన్నాడు.

రాజు సరేనని రాజధానికి తిరుగు ప్రయాణమయ్యాడు.

ఆరోజే గురువు ముగ్గురు శిష్యులనూ పిలిచి, ''దేశాటన చేసి ప్రత్యక్షంగా ఎంతో కొంత లోకజ్ఞానం సముపార్జిస్తేనే మీ విద్యాభ్యాసం పూర్తవుతుంది. మీరు ముగ్గురు మూడు దిశలకు విడివిడిగా వెళ్ళి, దేశాటన చేసి నలభైయవ రోజు ఆశ్రమానికి తిరిగి వచ్చి, మీకు ఎదురైన అనుభవాల గురించి చెప్పాలి,'' అన్నాడు.

ముగ్గురు యువకులూ మరునాడు వేకువ జామున గురువు ఆశీస్సులు పొంది బయలు దేరారు. రాజ్యంలోని వివిధ ప్రాంతాలు పర్యటించి, గురువు ఆజ్ఞాపించిన విధంగా నలభైయవ రోజు గురుకులానికి తిరిగి వచ్చారు.



ఆ సమయానికి రాజూ, మంత్రీ కూడా అక్కడే ఉన్నారు.

''దేశాటన చేసి అనుకున్న సమయానికి క్షేమంగా తిరిగి వచ్చినందుకు చాలా సంతోషం. మీరు చూసిన వింతలను విశేషాలను, ఎదుర్కొన్న అనుభవాలను, తెలుసుకున్న విషయాలను ఒక్కొక్కరుగా వివరించండి,'' అన్నాడు గురువు శిష్యులతో.

మొదట విలువిద్యా ప్రవీణుడైన ప్రతాపుడు, ''ఉత్తర దిశగా వెళ్ళిన నా ప్రయాణం ఎలాంటి ఇబ్బందులూ లేకుండా నల్లేరుపై బండిలా హాయిగా సాగింది. అయితే, రాజ్యం పొలిమేరలోని అడవి ప్రాంతంలో కొందరు యువకులు మారణాయుధాలు ప్రయోగించడం; పొంచి వుండి ప్రత్యర్థిని దొంగ దెబ్బ తీయడం లాంటి వాటిల్లో రహస్యంగా శిక్షణ



పొందుతూండడం గమనించాను. ఆరా తీయడంతో, వాళ్ళు పొరుగు రాజ్యమైన పుష్కళపురానికి చెందిన వారనీ; నిరుద్యోగంతో, పేదరికంతో నిరాశా నిస్పృహలకు లోనైన ఆ యువకులు ప్రశాంతంగా ఉన్న మన రాజ్యసరిహద్దుల్లో అలజడిని సృష్టించి, ప్రజల సంపదలను దోచుకోవడానికి తయారవుతున్నారనీ తెలియవచ్చింది. ఏం చేయడమా అని ఆలోచించి వాళ్ళకు శిక్షణనిస్తూన్న మధ్యవయస్కుణ్ణి, బండ చాటునుంచి బాణం ప్రయోగించి హతమార్చాను. ఈ విషయాన్ని రాజుగారి దృష్టికి తీసుకురావాలని భావించాను,'' అన్నాడు.

''దక్షిణ దిశగా వెళ్ళిన నాకు రాజ్యసరిహద్దుల్లోని మారుమూల గ్రామాల్లో దొంగల బెడద అధికంగా ఉన్నట్టు తెలియవచ్చింది. ఎప్పుడు దొంగలు వచ్చిపడతారో ఏమోనని ప్రజలు భయంతో బిక్కు బిక్కు మంటున్నారు. రక్షణా వ్యవస్థ లోపభూయిష్ఠం కావడమే ఆ దుస్థితికి కారణం. ఒక గ్రామం గుండా వెళుతూన్నప్పుడు వచ్చి పడిన దొంగలను స్వయంగా ఎదుర్కొని కత్తిసాము ప్రావీణ్యంతో తరుమగొట్టాను. ఆ తరవాత, అక్కడి యువకులకు కత్తిసాము శిక్షణనిచ్చి దొంగలను కలిసికట్టుగా ఎదుర్కొనే ధైర్యం కలిగించి వచ్చాను. మార్గ మధ్యంలో నా మీదికి ఉరికిన చిరుతపులిని చంపి, దాని చర్మాన్ని మీకు కానుకగా తీసుకువచ్చాను. స్వీకరించండి,'' అన్నాడు ప్రచండుడు.

''తూరుపు దిశగా వెళ్ళిన నాకు అంతా ప్రశాంతంగా గడిచి పోయింది. క్షాత్రవిద్యలను ప్రదర్శించే అవకాశం రాలేదు. పక్షం రోజులు ప్రయాణం చేసి నేను సుప్రసిద్ధ సింధుభైరవీ నగరాన్ని చేరాను. అక్కడి పురాతన కరివరదుడి ఆలయంలో ఒక వింత దృశ్యం కంటపడింది. అపురూప శిల్పాలకు నిలయమైన ఆ దేవాలయంలో ఒకస్తంభానికి చెక్కిన నర్తకి శిల్పానికి వెనక ఒక బల్లి ఇరుక్కుపోయి, బయటకు రాలేక నానా అవస్థ పడుతున్నది. దానిని వెలుపలికి తేవడం ఎలాగా అని ఆలోచిస్తూ అక్కడే కూర్చున్నాను. కొంత సేపటికి మరో రెండు బల్లులు తమ నోటితో ఆహారాన్ని తెచ్చి, ఆపదలో ఉన్న బల్లికి అందిస్తున్నాయి. దానిని చూసి అమితాశ్చర్యం చెందిన నేను, ఆలయ నిర్వాహకులకు విషయం చెప్పి, శిల్పులను

పిలిపించి బల్లి క్షేమంగా బయటపడేలా చేశాను. తిరుగు ప్రయాణంలో వి(క్రాంత అరణ్య ప్రాంతంగుండా వస్తూండగా, ఒక దిగుడు బావిలో ఏనుగుపిల్ల పడిపోవడం చూశాను. దానిని కాపాడే మార్గం తెలియక తక్కిన ఏనుగులు బావి చుట్టూ చేరి రోదిస్తు న్నాయి. ఆ సంగతిని దాపులనున్న భిల్లుల గూడానికి తెలియజేసి, వాళ్ళ సాయంతో గున్న ఏనుగును బావినుంచి పైకెత్తించాను. బల్లులు, ఏనుగుల మధ్య ఉన్న ప్రేమ, ఐకమత్యం మనుషులమైన మనలో కొరవ డడం భావ్యం కాదని వివరించి చెప్పి, తరచూ తెగల మధ్య చీటికి మాటికి గొడవలు పడే భిల్లుల మధ్య స్నేహసంబంధాలను ఏర్పరచి వచ్చాను,'' అన్నాడు ప్రశాంతుడు.

క్రూరులనూ, క్రూర మృగాలనూ శౌర్య పరాక్రమాలతో మట్టుపెట్టిన ప్రతాపుడు, ప్రచండుడు ఈ ఇరువురిలో ఒకరిని రాజును చేస్తే రాజ్యం క్షేమంగా ఉండగలదని తమలో తాము చర్చించుకుని రాజూ, మంత్రీ గురువు కేసి చూశారు.

``రాజా, తమకు సమ్మతమైతే రాజ్యసింహా సనానికి అన్ని విధాలా అర్హుడు ప్రశాంతుడే. అతడి పాలనలో సుప్రతీక ప్రజలు సుఖ శాంతులతో వర్ధిల్లగలరు,'' అన్నాడు గురువు విద్యాసాగరుడు.

ఆ మాట వినగానే రాజు ఉలిక్కి పడ్డాడు. కాని వెంటనే తేరుకుని, ``తమ అభిప్రాయాన్ని ఆజ్ఞగా భావించి శిరసావహిస్తున్నాను, గురు వర్యా,'' అన్నాడు.



బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, రాజుకు శౌర్యం ప్రధానం. అనుభవపూర్వకంగా దీనిని గ్రహించడం వల్లే రాజు సుదక్షణుడు రాజ్యం వీరభోజ్యం అని మొదటే చెప్పాడు. అటు వంటి రాజు దుండగులనూ, దుష్ట మృగా లనూ మట్టు పెట్టడంలో శౌర్య పరాక్రమాలు ప్రదర్శించిన మేటి యోధులను కాదని, జంతు ప్రేమను కనబరచిన ప్రశాంతుణ్ణి రాజును చేయడానికి ఎందుకు సమ్మతిం చాడు? గురువు విద్యాసాగరుడి మాట మీది గౌరవం కారణంగా రాజు దేశప్రజల భవిష్య త్తును ప్రశ్నార్థకం చేయడం భావ్యమా? గురువు ఇలాంటి సలహా ఇవ్వడానికి ఆయన పక్షపాతబుద్ధి కారణం కాదా? ఈ సందేహా లకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజుకు శౌర్య పరాక్రమాలు ప్రధానమే. అందులో అణు మాత్రం సందేహం లేదు. అయితే, వాటికి తోడు మానవత్వం, ప్రేమ చాలా అవసరం. ప్రశాంతుడికి ఆపదలో ఉన్న వారిని ఆదుకో వాలనే ఆర్తి, ప్రజలను కూడగట్టే నేర్పు ఉన్నవి. ప్రతి ప్రాణినీ ప్రేమగా చూడగల ప్రశాంతుడు రాజైతే ప్రజలను కన్న బిడ్డల్లా పరిపాలించ గలడు. విద్యాసాగరుడి వద్ద శస్త్రాస్త్ర విద్యలు నేర్చి మల్లయుద్ధంలో మొదటి వాడుగా వచ్చాడు గనక, ప్రశాంతుడికి శౌర్య పరాక్ర మాలు లేవనడం సబబు కాదు. అంతటి శక్తి సంపన్నుడికి మానవత్వం, పదిమందినీ కూడ గట్టగల నేర్పు ఉన్నాయి గనక-తక్కిన ఇరువురి శక్తిసామర్థ్యాలను కూడా తగిన విధంగా ఉపయోగించుకుని ప్రజల సుఖ సంతోషాలకూ, క్షేమానికీ పాటుపడగలడు. ఇవన్నీ క్షుణ్ణంగా ఆలోచించే గురువు విద్యా సాగరుడు ప్రశాంతుణ్ణి రాజ్యానికి అర్హుడిగా ఎంపిక చేశాడు. పక్షపాత బుద్ధితో కాదు. ఈ సత్యాన్ని గ్రహించడం వల్లే రాజు అందుకు సమ్మతించాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : నందిరాజు పద్మలతా జయరాం రచన]



# Get India's Most Loved Magazine for Children at your doorstep

Subscribe to *Chandamama*

चन्दामामा

చందమామ

चांदोबा

CHANDAMAMA

Junior

**12 issues for Rs 180/-**

*Chandamama* stories explore our traditions, folk tales, mythology, history and science in an unforgettable narrative style which captures your child's imagination.
Generations of children have grown up reading *Chandamama* in their native language.
Subscribe today and let your child's quest for knowledge stay alive forever.

---

I want to subscribe to the following editions of Chandamama: (Tick whatever applies)

☐ **English** ☐ **Language**........................................ ☐ **Junior Chandamama**

**My Name** .................................................................... Date of Birth ..............................

**Send my issues to**: Mr/Ms..........................................................................................................

Address ...........................................................................................................................

.......................................................................................................................................

.......................................................................................................................................

City.................................... State ...................................... Pin ..............................

Telephone.............................. Mobile ..................................... Email ............................

Enclosed Cheque/DD* for Rupees..........................................................................................

Cheque/DD no.............................................................Favouring **Chandamama India Ltd**

on ............................................................................ bank. (Send At-par cheques or add Rs. 60 for non-Chennai cheques) Your subscription will start in 4 weeks.

Please mail the subscribtion form to :
**Chandamama India Limited,** JVL Plaza, 6th Floor, 626 (Old 501) Anna Salai Teynampet, Chennai – 600 018.
Tel: (044) 24334455 Telefax: 24322103 Email: chandamama@chandamama.com Web: www.chandamama.com

*Language/edition for one year is Rs. 180. Only English: Rs. 180 for 1 year. English + any language: Rs. 360 for 1 year. English Chandamama + Junior: Rs. 360 for 1 year. English Chandamama + Junior + any language: Rs. 540 for 1 year.
*Conditions apply.



సుప్రసిద్ధ ఒరియా రచయిత జయంత మహాపాత్ర కవితలను ప్రపంచంలోని పలుదేశాలలో ప్రచురించారు. ఒరిస్సాలోని కటక్‌లో ఉంటున్న మహాపాత్ర 'చంద్రభాగ' అనే సాహిత్య పత్రికకు సంపాదకత్వం వహిస్తున్నారు.

# నడిరేయి జడివాన!

ఇంటి బయట తడిగాలులు బలంగా వీస్తున్నాయి. కారు మేఘాలు దట్టంగా కమ్ముకోవడంతో అంతా చిమ్మచీకటి. వాన కురిసే శబ్దం అంతటా జుయ్ మంటూ రొదచేస్తోంది.

మోహన్ కిటికీ తలుపు తెరిచి చూశాడు. నల్లటి గోడలా చీకటి. కదులుతూన్న చారల్లా అక్కడక్కడా తలలూపుతూన్న చెట్లు.

అతడి ఇంటికి వంద అడుగుల కుడివైపున దూరంలో చీకట్లను తరమడానికి విఫలయత్నం చేస్తూన్న ఒక్కగానొక్క విద్యుత్ స్తంభానికి వెలుగుతూన్న విద్యుద్దీపం. ఉన్నట్టుండి వీచిన చల్లటి గాలి తాకిడికి మోహన్ బక్క ప్రాణం చలితో వణికిపోయింది. మోహన్ చప్పున గది కిటికీ తలుపు మూసి గొళ్ళెం పెట్టాడు. వర్షం ఆగే సూచనలు కనిపించలేదు.



అది తొమ్మిదికి ఐదడుగుల ఇరుకు గది. మంచం పక్కన చిన్న మేజా, కుర్చీ వేయడానికి చాలినంత చోటు మాత్రమే ఉన్నది. మేజా మీద పుస్తకాలు, కాగితాల కట్టలు ఉన్నాయి. వాటి మీద పెద్ద 'అనాటమీ వాల్యూమ్' తెరువబడి ఉన్నది. దాని పక్కనే నవ్వుతున్నట్టు అతడు అధ్యయనం చేస్తూన్న మానవ కపాలం.

విడువకుండా కురుస్తూన్న జడివాన అతడిలో విసుగును కలిగించింది. రేపే గనక పరీక్ష లేదంటే, అతడీపాటికి పుస్తకాన్ని మూసేసి ముసుగుదన్ని హాయిగా నిద్రపోయి ఉండేవాడు. లేకుంటే పడకపై పడుకుని డిటెక్టివ్ థ్రిల్లర్‌ను చదువుకుంటూ గడిపేవాడు. యాక్షన్ నిండిన జేమ్స్ బాండ్ పుస్తకాలంటే అతడికి ప్రాణం. చదవడం ప్రారంభిస్తే పూర్తి చేసేంత వరకు పుస్తకం మూసేవాడు కాడు. అయితే, ఇప్పుడేమో అనాటమీ పాఠాలను బట్టీ పట్టవలసిన నిర్బంధం. 'ఇంతకు మించిన శిక్ష మరేదైనా ఉందా దేవుడా' అని వాపోయాడు!

టిక్ టిక్ అనే గడియారం శబ్దం అతడి ఆలోచనలకు అంతరాయం కలిగించింది. నిదుర పట్టినా అందమైన కలలలో తేలియాడవచ్చు. ఈ గడియారం శబ్దం కారణంగా నిదుర కూడా రావడం లేదు అను



కుంటూ అతడు షెల్ఫ్‌లోని చిన్న గడియారం కేసి చూశాడు. పన్నెండు దాటి పది నిమిషాలయినట్టు తెలిసింది. అప్పటికే అర్ధరాత్రి దాటిందన్న మాట!

పట్టు వదలకుండా పుస్తకం మీద మనసును కేంద్రీకరించడానికి అతడు ప్రయత్నించాడు. అయితే, పుస్తకంలోని అక్షరాలు అతణ్ణి ఏమాత్రం ఆకర్షించలేకపోయాయి. అతడి దృష్టి మేజా మీది మానవ కపాలం మీద పడింది. దాన్ని అతడు పరిశీలనగా చూడసాగాడు. అతడి చూపులతో పాటు ఆలోచనలు కూడా కపాలం మీద, ముఖ్యంగా దాని రెండు కళ్ళ కంతల మీద కేంద్రీకృతమయ్యాయి.

గతంలో ఆ కంతలలో అందమైన కళ్ళు ఉండేవి కదా! ఆ కళ్ళు మనలో చాలా మంది లాగే ప్రేమిస్తూ, ద్వేషిస్తూ జీవించి ఉంటాయి అనుకున్నాడు. ఉన్నట్టుండి గడియారం టిక్ టిక్ శబ్దం ఎక్కువయినట్టనిపించింది. గదిలో వేరెవరో ప్రవేశించినట్టు, ఫలానా అని చెప్పలేని ఆ శక్తి గది అంతా వ్యాపించినట్టు వింత భావన కలగడంతో అతడి మనసును చెప్పరాని భయం పట్టుకున్నది.

కొంత సేపటికి హఠాత్తుగా గది లోపల ఎక్కడో ఎవరో గోడను గోళ్ళతో మెల్లగా గోకుతూన్న శబ్దాన్ని అతడు స్పష్టంగా వినగలిగాడు. భయంతో చుట్టూ కలయచూశాడు. శబ్దం తక్కున ఆగిపోయింది. భీతికొలిపే నిశ్శబ్దం గుండెను పిండినట్టయింది. కళ్ళను గట్టిగా మూసుకుని తను విన్న శబ్దం కేవలం భ్రమ మాత్రమే అని మళ్ళీ మళ్ళీ అనుకున్నాడు. పుస్తకం మూసేసి వెళ్ళి పడుకోవాలని లేవబోయాడు.

సరిగ్గా ఆ సమయంలో మళ్ళీ ఆ గోకుతు
శబ్దం వినిపించ సాగింది మరింత స్పష్ట
మరీ దగ్గర నుంచి వస్తున్నట్టనిపిం
భయంతో కంపించి పోయాడు. అ
చూశాడు. ఆ శబ్దం మానవ క
వస్తున్నట్టు గ్రహించాడు.
కొట్టుకోసాగింది. తన ప్రమే
తను కపాలం కేసి చూ
చూపులను దాని నుంచి
కంగారు పడ్డాడు. మ
మీది కపాలం కొద్దిగా
కదలసాగింది. దాని య
మీదే ఉన్నది. గుండె బ ద్దలవు
కెవ్వున అరిచి అలాగే స్పృహకో
మోహన్ కళ్ళు తెరి చూసినప్ప
పరిచిత ముఖాలు కని ంచాయి. వా
నవ్వుతూ మేజా కేసి యిచూపాడు.
అటు కేసి చూశాడు. ంద పడి విరిగిన క
ఎముకల మధ్య, అవ ాయకంగా పడివున్న
చచ్చిన చిట్టెలుక కని పించింది!

మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (29)

# అర్ధరాత్రి ఆక్రందన!

శ్రీరామకృష్ణ పరమహంస (1836-1886) ప్రధాన శిష్యుడైన స్వామి వివేకానంద (1862-1902) తన అద్భుతమైన వాగ్ధాటితో భారతీయ తత్వ చింతనా స్రవంతి అయిన వేదాంతాన్ని విపులీకరించడం ద్వారా అమెరికా దేశ మేధావులలో పెద్ద కదలికను కలిగించాడు. అంత వరకు భారత దేశం అన్నా ఇక్కడి మతం అన్నా మూఢ విశ్వాసాల, అర్థంపర్థం లేని ఆచార వ్యవహారాల పుట్టగా అక్కడి పలువురు భావిస్తూ ఉండేవారు. స్వామిజీ ఉపన్యాసాలను విన్నవారు వేదకాలంలోనే భారతదేశంలో మానవుడి సత్యాన్వేషణ ఆరంభమయిందన్న సత్యాన్ని గ్రహించగలిగారు. భారత దేశం పట్ల గౌరవం చూపసాగారు. త్వరలో వందలాది మంది అమెరికా దేశస్థులు, ఆయన శిష్యులుగా, అభిమానులుగా చేరారు.

అమెరికా తరవాత ఆయన ఇంగ్లాండులోనూ పర్యటించాడు. అక్కడ కూడా ఆయన ఉపన్యాసాలు సత్యాన్వేషకులపై గాఢమైన ప్రభావాన్ని చూపాయి. పలువురు ఆయనకు శిష్యులయ్యారు. అలాంటి వారిలో ఉత్తరోత్తరా సిస్టర్ నివేదితగా, తన జీవితాన్ని భారతదేశ సేవకు అంకితం చేసిన మిస్ మార్గరెట్ నోబెల్ మున్నెన్న తగినవారు.

1896లో స్వామీజీ మాతృదేశానికి తిరిగి వచ్చాడు. దేశప్రజలు ఆయనకు ఘన స్వాగతం పలికారు.



గురుదేవులు శ్రీరామకృష్ణ పరమహంస పవిత్ర స్మృతిని చిరస్థాయిగా నిలబెట్టాలన్న సంకల్పంతో స్వామి వివేకానంద తోటి శిష్యులతో కలిసి రామకృష్ణ మిషన్ను స్థాపించాడు. అందులోని సభ్యులందరూ ఆధ్యాత్మిక లక్ష్య సాధనతో పాటు, దేశంలోని అభాగ్యజీవులైన పేదలకు సేవలందించాలన్న ఉన్నత ఆశయం కలిగిన యువసన్యాసులే. కొల్‌కతా శివారు ప్రాంతమైన బేలూరులో ప్రధాన కార్యాలయం ఏర్పాటు చేసుకున్నారు. దానికి బేలూరు మఠమనే పేరు వచ్చింది.

తోటి సన్యాసులతో కలిసి స్వామీజీ అక్కడే ఉండేవారు. ఆయన ఉంటూన్న గదికి పక్కనే శ్రీరామకృష్ణ పరమహంస మరొక ముఖ్య శిష్యుడు విజయానంద ఉండేవాడు.

అది హుగ్లీ (గంగా)నదీ తీరంలోని మఠంలో

ప్రశాంతమైన అర్ధరాత్రి సమయం. విజయానందకు లీలగా ఏదో వింత శబ్దం వినిపించింది. దానిని ఆయన జాగ్రత్తగా విన్నాడు. ఎవరో ఏడుస్తూన్న శబ్దం. గది నుంచి వెలుపలికి వచ్చి చూశాడు. వరండాలో ఒక్కరూ కనిపించలేదు. స్వామి వివేకానంద గదిలోకి తొంగి చూశాడు. అక్కడి దృశ్యం చూసి విజయానంద దిగ్భ్రాంతి చెందాడు. నేల మీద బోర్లా పడుకుని స్వామి వివేకానంద ఏడుపును దిగమింగడానికి ప్రయత్నిస్తున్నాడు. విజయానంద మెల్లగా తలుపు తెరుచుకుని సద్దు చేయకుండా లోపలికి వెళ్ళి స్వామి వివేకానంద పక్కన కూర్చుని ఆయన్ను మెల్లగా స్పృశించాడు.

ఆశ్చర్యంతో లేచి కూర్చున్న స్వామీజీ, ముఖాన్ని తుడుచుకుంటూ, ''నువ్వు మేలుకునే ఉన్నావా?'' అని అడిగాడు గద్గద స్వరంతో.

''ఆరోగ్యం బాగోలేదా?'' అని అడిగాడు విజయానంద ఆదుర్దాగా.

''అదేం లేదు. బాగానే ఉన్నాను,'' అన్నాడు స్వామీజీ.

ఆయన సమాధానం విజయానందకు సంతృప్తిని కలిగించలేదు. స్వామీజీ విచారానికి కారణం అడిగాడు. వజ్రసదృశహృదయుడూ, శక్తివంతుడైన తమ యువనాయకుడూ అయిన స్వామీజీ కన్నీళ్ళు కారుస్తూ ఏడ్వడం అంటే ఊహించలేక పోయాడతడు.

స్వామీజీ, మాట మారుస్తూ వేరు విషయాలను గురించి మాట్లాడడం మొదలు పెట్టాడు. అయినా విజయానంద వదిలి పెట్టేలా లేడు. ఆఖరికి స్వామీజీకి అసలు సంగతి బయట పెట్టక తప్పలేదు: ''పాశ్చాత్యదేశాలలో ప్రజలు సిరిసంపదలతో తులతూగుతూ సుఖసంతోషాలతో జీవించడం చూశాను. మాతృదేశానికి తిరిగి వచ్చాక ఇక్కడ కోట్లాది మంది ప్రజలు పేదరికంలో తలమునకలుగా విలవిల లాడుతూండడం చూసి భరించలేకపోయాను. పలుసార్లు బిగ్గరగా ఏడ్వాలనిపించింది. పగటిపూట గనక, ఆ బాధను నాలోనే దిగమింగుకున్నాను. నా బాధను, ఆవేదనను పదుగురి ఎదుట బయటపెట్టడం ఇష్టం లేదు. ఇప్పుడు రాత్రిపూట ఒంటరిగా ఉండడం వల్ల నా భావోద్వేగాలను నాలోనే అణచు కోవలసిన అవసరం లేకపోయింది. కన్నీళ్ళు పొంగి పొర్లాయి!''

స్వామీజీని ఓదార్చడానికి విజయానందకు మాటలు లేకపోయాయి. ఇద్దరూ కొంత సేపు మౌనంగా కూర్చున్నారు. ఆ తరవాత స్వామీజీ చిన్నగా నవ్వడంతో విజయానంద లేచి తన గది కేసి అడుగులు వేశాడు. -(ఎం.డి)









## ఆదర్శ గ్రామం

తమిళనాడు కోయంబత్తూరు జిల్లాలోని కేతనూర్ 1,500 ఇళ్ళుగల గ్రామం. అక్కడి 7,000 మంది జనాభాలోని ఒక్కరూ మద్యం ముట్టుకోరు. పొగతాగరు. గ్రామంలో అందరూ అంటే నూరు శాతం అక్షరాస్యులే. యువతీ యువకులందరూ పట్టభద్రులు. కాంక్రీటు రోడ్డుగల గ్రామం చాలా శుభ్రంగా ఉంటుంది. రోడ్డు పక్క చెత్తా చెదారం కనిపించదు. దుర్వాసన అంటూ ఉండదు. ఇక్కడి రోడ్లను యువతీయువకులే శుభ్రపరుస్తారు. పిల్లలందరూ బడికి వెళతారు. గత పదేళ్ళలో ఒక్కరూ అర్ధంతరంగా బడి మానేసిన దాఖలాలు లేవు. ఇన్ని శుభలక్షణాలుగల ఆ గ్రామాన్ని ఆదర్శగ్రామం అనకుండా ఉండగలమా? ఆ గ్రామప్రజలను ప్రశంసించకుండా ఉండగలమా?

## ఖజురహో దేవాలయాలు

ఏ రాజ్యపాలకులైనా రాజధానీ నగరంలో, నగర పరిసరాలలో ఆలయాలు నిర్మించడం ఆనవాయితీ. అయితే ఇప్పటి మధ్యప్రదేశ్‌ను ఒకప్పుడు పాలించిన చండేలా వంశస్థులు రాజధానికి దూరంగా జగత్ప్రసిద్ధిగాంచిన ఖజురహో దేవాలయాలు నిర్మించారు. అవి క్రీ.శ. 950-1050 మధ్య కాలంలో నిర్మించబడ్డాయి. పురాతన భారతీయ శిల్ప నైపుణ్యానికి అవి చక్కని తార్కాణాలు. బ్రహ్మాండమైన పెద్ద పెద్ద నిర్మాణాలకు కాకుండా అందమైన కుడ్య శిల్పాలకు ఈ దేవాలయం ప్రసిద్ధిగాంచింది. వెయ్యేళ్ళ నాటి భారతీయ జీవితంలోని వివిధ పార్శ్వాలు సుందర శిల్ప రూపాలుగా మలచబడ్డాయి.



## బీర్బల్ కథలు : 9

# బావిలోని వజ్రపుటుంగరం

వేసవి మండిపోతోంది. కణకణలాడే అగ్ని గోళంలా తొందరగా ఉదయించే సూర్యుడు బారెడు పైకెగబ్రాకేలోగా నిప్పులు చెరగడం ప్రారంభిస్తున్నాడు. అక్కడక్కడ నీటి చెలమలు తప్ప నదులు ఇసుకమేటల్లా కనిపించసాగాయి. బావులు ఎండి పోయాయి. ఎండ తీవ్రతకు తట్టుకోలేక పగటి పూట వీధుల్లో తిరగడానికే జనం భయపడసాగారు.

ఒకనాటి పేకువసమయంలో అక్బర్ చక్రవర్తి వాహ్యాళికి బయలుదేరాడు. ఆయన వెంట ఎప్పటిలాగే బీర్బల్‌తో సహా మరి కొందరు ప్రముఖులు కూడా ఉన్నారు. కొంతసేపు నడిచాక, ''ఇప్పుడే వేడి ఆరంభమవుతున్నది. బావులన్నీ ఎండిపోతున్నాయి,'' అంటూండగా అక్బర్ దృష్టి రహదారి పక్కనే ఉన్న ఒక బావి మీద పడింది. ''ఆ బావిలో నీళ్ళున్నాయేమో చూద్దాం రండి,'' అంటూ వెళ్ళి ఆయన బావిలోకి తొంగి చూశాడు. తక్కిన వారు కూడా ఆయన్ను అనుసరించి వెళ్ళారు.

''బొట్టు నీళ్ళు లేవు,'' అంటూ దీర్ఘంగా నిట్టూర్చాడు చక్రవర్తి.

''వర్షాలు వచ్చేంతవరకు ఈ పరిస్థితి తప్పదు ప్రభూ! బావిలోకి ఏదైనా వేసి అది నేలను తాకుతుందా అని చూడడానికి ఇది అనువైన కాలం. నీళ్ళున్నప్పుడు వేస్తే అలా చూడలేము,'' అంటూ బీర్బల్ బాట పక్కనే ఉన్న చిన్న రాయిని తీసి బావిలోకి విసిరాడు. అది నేలను తాకిన శబ్దం 'టప్'మని వినిపించింది.

''ఒకరాయికి తోడు మరొక రాయి కావాలి కదా,'' అంటూ చక్రవర్తి తన వేలికి ఉన్న వజ్రం పొదిగిన బంగారు ఉంగరాన్ని తీసి బావిలో వేశాడు. దాన్ని చూసి బీర్బల్ నివ్వెరపోయి, ''ఒకరాయికి తోడు మరొక రాయి కావలసిందే. కాని, మామూలు రాయికి విలువైన వజ్రం తోడు కాజాలదు కదా?'' అన్నాడు. చక్రవర్తికి తను చేసిన పొరబాటు తెలియ



వచ్చింది. తొందరపడి ఆ పని చేసినట్టు గ్రహిం చాడు. సరే జరిగిందేదో జరిగిపోయింది. బావి లోకి దిగగల వారి చేత ఉంగరాన్ని వెలికి తీయిస్తే సరిపోతుంది, అని అనుకుంటూం డగా ఆయనలో ఒక వింత ఆలోచన కలి గింది. ''బీర్బల్, మనిషిని బావిలోకి దింపి ఉంగరాన్ని వెలుపలికి తీయించవచ్చు. అయితే...'' అంటూ ఆగాడు చక్రవర్తి.

''ఏమిటో సెలవివ్వండి, ప్రభూ!'' అన్నారు బీర్బల్‌తో సహా అందరూ ముక్తకంఠంతో.

''అయితే, బావిలోకి దిగకుండా పైనుంచే ఉంగరాన్ని ఎవరైనా వెలికి తీయగలరా?'' అని అడిగాడు చక్రవర్తి.

''అసాధ్యం!'' అన్నాడు ఒక వృద్ధ ప్రము ఖుడు.

''అంటే, బావిలోకి దిగకుండా ఉంగ రాన్ని వెలికి తీసే మార్గమే లేదంటారు. అంతే కదా?'' అని అడిగాడు చక్రవర్తి.

''అంతే ప్రభూ. అందులో ఏమాత్రం సందేహం లేదు,'' అన్నాడు మరొక ప్రము ఖుడు.

''బీర్బల్, నీ అభిప్రాయమేమిటి?'' అంటూ బీర్బల్ కేసి తిరిగాడు చక్రవర్తి.

''ఆ విషయంగానే ఆలోచిస్తున్నాను, ప్రభూ,'' అంటూ తలపాగా తీసి బుర్ర గోక్కో సాగాడు బీర్బల్.

''బుర్రగోక్కున్నంత మాత్రాన పరిష్కార మార్గం తెలుస్తుందనుకుంటున్నాడు బీర్బల్,'' అన్నాడు ఒక ప్రముఖుడు హేళనగా.

''అవును. నాకు తరచూ అలా జరుగు తుంది. నీకు జరగదేమో!'' అన్నాడు బీర్బల్.

''నీకు మాత్రం ఎలా జరుగుతుంది?'' అని అడిగాడు ప్రముఖుడు.

''బుర్ర ఉందిగనక! నీకు లేదు. ఆలోచన రావడం లేదు, అందుకు నేనేం చేయను?'' అన్నాడు బీర్బల్.



ఆ మాటకు చక్రవర్తితో సహా అందరూ గల గలా నవ్వారు.

''ఆ..చెప్పానా... బుర్ర గోక్కుంటే మంచి ఉపాయం తోస్తుందని. ఇప్పుడు ఉంగరాన్ని ఎలా వెలికి తీయాలో తెలిసిపోయింది,'' అన్నాడు బీర్బల్ ఉత్సాహంతో.

''ఎలా తీస్తావో చెప్పు,'' అని అడిగాడు చక్రవర్తి

చాలా ఆత్రుతగా.

''అందుకు కొంచెం సమయం కావాలి జహాపనా! అంతా సక్రమంగా జరిగితే సాయంకాలాని కల్లా వెలికి తీయగలను. అంతవరకు నా పథకాన్ని రహస్యంగా ఉంచడం మంచిది,'' అన్నాడు బీర్బల్ వినయంగా.



''ఇందులో తిరకాసు ఏదీ లేదు కదా!'' అన్నాడు ఇంతకు ముందు బీర్బల్ చేత అపహాస్యానికి గురైన ప్రముఖుడు.

''అది నా నైజానికి విరుద్ధమైనది ప్రభూ! అయినా, ఆ పనిని సాధించే చక్కటి ఉపాయం ఉన్నప్పుడు, అడ్డుదారులతో నాకు పనేమిటి?'' అన్నాడు బీర్బల్ ఎంతో విశ్వాసంతో.

''బావుంది. కాని ఇద్దరు భటులను కాపలా ఉంచడం ఎందుకైనా మంచిది ప్రభూ,'' అన్నాడు ప్రముఖుడు అంతటితో వదలిపెట్టకుండా.

''బీర్బల్ మీద నాకు పూర్తి నమ్మకం ఉంది. అయినా, నీ సలహాను కూడా పాటిస్తాను,'' అంటూ చక్రవర్తి ఎవరూ బావిలోకి దిగకుండా చూసుకోమని ఇద్దరు భటులను ఏర్పాటు చేసి వెళ్ళాడు.

అక్కడే ఉండిపోయిన బీర్బల్ చుట్టుపక్కల కలయచూశాడు. కొద్ది దూరంలో ఒక గుడిసె, దాని పక్కన చెట్టుకు కట్టబడిన ఒక ఆవు కనిపించాయి. బీర్బల్ చకాచకా గుడిసె వద్దకు వెళ్ళి, ''లోపల ఎవరున్నారు?'' అని పిలిచాడు.

వంగిన నడుముతో ఒక ముసలావిడ వెలుపలికివస్తూ, ''ఏం, నాయనా ఏం కావాలి? నువ్వెవరు?'' అని అడిగింది.

''అమ్మా, ఒక కడియ ఆవుపేడ కావాలి. కావాలంటే డబ్బిస్తాను,'' అంటూ దుస్తుల నుంచి చిల్లర తీశాడు.

''ఆ భాగ్యానికి డబ్బెందుకు నాయనా. అదిగో ఆవు పేడవేసింది చూడు. వెళ్ళి తీసుకో. అప్పుడే పొద్దెక్కి ఎండ కాల్చేస్తోంది,'' అంటూ గుడిసెలోపలికి వెళ్ళింది ముసలావిడ.

బీర్బల్ ఎడమ చేత్తో పేడ కడియను తీసుకుని బావివద్దకు వచ్చి లోపలికి తొంగి చూశాడు. వజ్రపుటుంగరం తళ తళా మెరుస్తున్నది. ఉంగరాన్ని గురి చూసి పేడను ముద్దగా చేసి దాని మీదికివేశాడు. సరిగ్గా అది ఉంగరం మీద పడింది. ఇప్పుడు ఉంగరం కనిపించడంలేదు.

బీర్బల్ తరవాత ఒక చిన్న రాయినీ, చేతా

డంత పొడవాటి సన్నటి దారాన్నీ తీసుకు న్నాడు. దారం ఒక కొసతో రాయిని గట్టిగా కట్టాడు. ఆ తరవాత రాయిని బావిలోని పేడ మీదికి గురి చూసి వదిలాడు. అది వెళ్ళి పేడమీద పడింది. బీర్బల్ సంతోషంగా దారం రెండవ కొసను బావికి పక్కనున్న ఒక మొక్కకు కట్టి, ''మీరు ఇక్కడే దీనికి కాపలా కాస్తూ ఉండండి. సాయంకాలానికి వస్తాను,'' అని భటులకు చెప్పి, అక్కడి నుంచి బయలు దేరాడు. ఎండ తీవ్రంగా ఉంది. అయినా అది తన పథకానికి చక్కగా ఉపయోగపడుతుం దని బీర్బల్ సంతోషించాడు.

సూర్యుడు అస్తమించడానికి గంటసేపు ఉందనగా బీర్బల్ బావిదగ్గరికి వెళ్ళాడు. మొక్కకు కట్టిన దారాన్ని చేతికి చుట్టుకుని, దారాన్ని బావి నుంచి జాగ్రత్తగా పైకి లాగ సాగాడు. దారానికి కట్టిన రాయి, దాంతో పాటు రాయి చుట్టూ ఎండకు పిడకలా ఎండి పోయిన పేడ, పేడలోపలి చక్రవర్తి వజ్రపు టుంగరం పైకి రాసాగాయి. బీర్బల్ పిడకను అందుకుని విరిచి చూశాడు. అందులో వజ్రపుటుంగరం కనిపించింది. దానిని శుభ్రంగా కడిగి దుస్తుల్లో దాచుకుని చక్రవర్తి దర్శనానికి బయలుదేరాడు బీర్బల్. రాజ భవనం చేరేసరికి అక్కడ చక్రవర్తితో సహా పలువురు ప్రముఖులు కనిపించారు.

''షహేన్‌షా!'' అంటూ బీర్బల్ వంగి సలాం చేశాడు.

''ఉంగరం తెచ్చావా?'' అని అడిగాడు చక్రవర్తి.

''తెచ్చాను. ఇదిగో, ఆలంపనా!'' అంటూ బీర్బల్ చక్రవర్తికి ఉంగరం అందించాడు వినయంగా.

''ఎలా వెలికి తీశావు? ఇప్పుడు చెప్పు,'' అని అడిగాడు చక్రవర్తి.

బీర్బల్ అంతా వివరించాడు.

''వాహ్! వాహ్! నిజంగానే నువ్వు అందరి కన్నా తెలివైనవాడివి బీర్బల్,'' అంటూ చక్రవర్తి అతడికి నాణాల సంచీని బహూక రించాడు.

''ఆశ్రితపోషణలో, దయాగుణంలో మీకు సాటిరాగల రాజులు భూప్రపంచంలోనే లేరు షహేన్‌షా!'' అంటూ బీర్బల్ నాణాలను అందుకుని చక్రవర్తికి మరోసారి సలాం చేశాడు.



# చందమామ కబుర్లు

## హిమాలయాలలో పాద ముద్రలు



ఎట్టకేలకు నిగూఢమైన 'ఏతి' అనే వికారపు మంచు మనిషి ఉండే వాడనడానికి మద్దతుగా ఒక సాక్ష్యం కనుగొన్నట్టు తెలుస్తోంది. జోషువా గేట్స్ నాయకత్వంలో అమెరికాలోని ఒక టీవీ ఛానల్‌కు చెందిన బృందం హిమాలయాలలో 2,850 మీటర్ల ఎత్తయిన ఖుమ్బా ప్రాంతం నుంచి తిరిగి వస్తూ 12 అంగుళాల పొడవైన పాద ముద్రలను కనుగొన్నారు. గత నవంబర్ 28వ తేదీ ఆ బృందంలోని టూల్ బహదూర్ రాయ్ అనే అసిస్టెంట్ గైడ్ మొదట ఒక పాద ముద్రను చూశాడు. ఆ తరవాత తక్కిన బృంద సభ్యులు మరి కొన్ని పాదముద్రలను కనుగొన్నారు. అవి 'ఏతి'కి సంబంధించినవని భావిస్తున్నారు. వాటిని ఫోటోలు తీశారు. వాటి నమూనాలను కూడా తయారు చేశారు. "'ఏతి' వాస్తవమైనది; అది కేవలం ఊహకాదు," అని గేట్స్ విలేకరులకు తెలియజేశాడు.

## ఇదోరకం రికార్డు




కేరళలో పెరియ ప్రభుత్వ మహోన్నత పాఠశాల గత డిసెంబర్ 23వ తేదీ స్వర్ణోత్సవాలు జరుపుకున్నది. ఆ సందర్భంగా ఒక రోజంతా పాత విద్యార్థులతో సహా మొత్తం వందమంది వక్తలు విద్యార్థులను, తల్లిదండ్రులను తమ ఉపన్యాసాలతో ముంచెత్తారు. విద్య, సంస్కృతి, కళలు, రాజకీయాలు, వృత్తి విద్యలు, జర్నలిజం, ఆధ్యాత్మికం, కేరళకు, ఇండియాకు వెలుపలి జీవితం మొదలైన పదిహేను అంశాల మీద ఒక్కొక్కరు ఐదు నిమిషాలు ఉపన్యసించారు.

### చందమామ క్విజ్-2 (మార్చ్ 2008) సమాధానాలు

1. జయ విజయులు 2. వాల్మీకి 3. దుర్వాసుడు 4. అదితి 5. బృహస్పతి, శుక్రాచార్యుడు 6. అంగీరసుడు, అత్రి, క్రతు, మరీచి, పులహుడు, పులస్త్యుడు, వసిష్ఠుడు 7. కుబేరుడు 8. మనుషుల పాపపుణ్యాల చిట్టారాసే యమధర్మరాజు లేఖకుడు 9. దుర్గాదేవి, కృష్ణుడు, రాముడు 10. విఘ్నేశ్వరుడు.

## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు-8

# పట్టుబడని వృద్ధసింహం

నెరిసిన గడ్డం, ముడతలు పడ్డ చర్మం; రూపంలో వృద్ధుడే గాని కున్వర్ సింగ్ హృదయం నవ యౌవనం! చూపుల్లో తీక్షణ్యం!! అంటూ కీర్తించబడ్డ ఆ వృద్ధ సింహం శత్రువులపై ఉరకడానికి సరైన సమయం కోసం ఎదురు చూస్తూ అరణ్యం మధ్య కూర్చున్నాడు. అది ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం జరుగుతూన్న 1857వ సంవత్సరం. అనేక అపజయాల అనంతరం అతి ప్రయత్నం మీద బ్రిటిష్ దొరతనం ఆయనరాజ్యాన్ని ఆక్రమించుకోగలి గింది కాని, కున్వర్ సింగ్‌ను పట్టుకోలేక పోయింది.

బీహార్‌లోని జగదీశ్‌పూర్ పాలకుడైన రాజా కున్వర్ సింగ్‌ను, ఒకానొక ప్పుడు ఉజ్జయినిని పరి పాలించిన విక్ర మాదిత్యుడి వంశానికి చెందిన వాడని స్థానిక పూర్వగాథలు పేర్కొంటాయి. అరణ్యమంటే ఆయనకు మహా ఇష్టం. బాల్యం నుంచే మిత్రులతో కలిసి అక్కడ దాగుడు మూతలు ఆడుకునే వాడట. యువకుడిగా ఎదిగాక గెరిల్లా యుద్ధ పద్ధతులను అభ్యసించాడు. అది ఆయనకు ఉత్తరోత్తరా శత్రువులను చిత్తు చేయడానికి ఎంతగానో ఉపకరిం చింది.

భారత ఉపఖండంలోని చిన్న చిన్న రాజ్యా లను ఒక్కొక్కటిగా బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ ఏదో విధంగా కబళిస్తూన్న కాల ఘట్టం అది. దాని పేరాశ నుంచి జగదీశ్‌పూర్ కూడా తప్పించుకోలేక పోయింది. అయినా, దాని పాలకుడైన రాజా కున్వర్ సింగ్ కొందరు విశ్వాసపాత్రులైన అనుచరులతో సమీప అరణ్యంలోకి తప్పించుకుని వెళ్ళి, తిరిగి వచ్చి ఆక్రమించుకోవడానికి అనువైన సమయం కోసం ఎదురుచూడసాగాడు.



శత్రుసేనలు రాజధానిలో జొరబడి రాజభవ నాన్ని సమూలంగా నాశనం చేశాయి. విగ్రహా లతో సహా దేవాలయాలను ధ్వసం చేశాయి. దాంతో జగదీశ్‌పూర్‌ను మాత్రమే కాకుండా యావత్ భారతదేశానికిపరాయిపాలన నుంచి విముక్తి కలిగించాలని కున్వర్‌సింగ్ ఆలోచించ సాగాడు.

లక్నోను జయించడానికి బ్రిటిష్ సైని కులు ఔధ్‌కు వెళుతున్నారని తెలిసింది. వెంటనే తన అనుచరులతో మరి కొన్ని విప్లవ శక్తులను సమీకరించుకుని, శత్రుసేనలను ఎదుర్కోవ డానికి కున్వర్ సింగ్ బయలుదేరాడు. గెరిల్లా యుద్ధంలో నేర్పరి అయిన రాజా కున్వర్ సింగ్ అనేక పోరాటాల్లో గెలుపొందాడు. జగదీశ్‌పూర్ సైనికులు బ్రిటిష్ సేనానాయ కుణ్ణి, సైనికులను అజిమ్‌గఢ్ కోట ప్రాంగ ణంలో బందీలుగా చేశారు.

అయితే, జగదీశ్‌పూర్ కేసి వెళ్ళకుండా కున్వర్‌సింగ్‌ను ఎలాగైనా అడ్డుకోవాలని బ్రిటిష్ పాలకులు నిర్ణయించారు. గవర్నర్ జనరల్ కానింగ్ ప్రభువు, కున్వర్ సింగ్ అపూర్వ శక్తి సామర్థ్యాలు, ధైర్యసాహసాలు తెలిసినవాడు గనక, ప్రమాదకరమైన పరిస్థితిని పసిగట్టి- భారతీయ సైనికవిధానాలు బాగా ఎరిగిన లార్డ్ మార్క్ కెర్‌ను కున్వర్ సింగ్‌ను బంధిం చడానికి పంపాడు. అంతకు ముందే బలమైన బ్రిటిష్ సైన్యం భయం కరమైన ఆయుధాలతో అజిమ్ గఢ్ పొలిమేరలను చేరుకు న్నది.

శ్వేతాశ్వాన్ని అధిరోహించిన రాజా కున్వర్ సింగ్‌ఫిరంగులు, తుపాకుల భయంకరధ్వనుల మధ్య మెరుపు వేగంతో ఖడ్గయుద్ధం చేసి శత్రు వుల తలలు తెగటార్చి తన అనుచరులకు స్ఫూర్తిని కలిగించాడు. అధిక సంఖ్యాబలం, ఆయుధ బలం ఉన్నప్పటికీ బ్రిటిష్ సేనలు అనేక ఓటములు చవిచూడవలసి వచ్చింది. ఆఖరికి తుపాకుల బలంతో అజిమ్‌గఢ్‌ను చుట్టుముట్టి బందీలుగా వున్న తమ వారిని విడిపించ గలిగాయి.

శత్రువుల బలం, బలహీనతల లాగే తన వారి బలాబలాలను స్పష్టంగా బేరీజు వేయ గల రాజా కున్వర్ సింగ్-బ్రిటిష్ సేనలను అజిమ్‌గఢ్ కోట నుంచి వెలుపలికి రానీయ కుండా అడ్డుకున్నాడు. శత్రుసేనల కన్నుగప్పి జగదీశ్‌పూర్‌కు చేరుకుని దురాక్రమణ దారులను తరుమగొట్టాలని పథకం రచిం చాడు. అందుకు ధైర్యవంతులైన సైనికులను జాగ్రత్తగా ఎంపిక చేసి మార్గ మధ్యంలో వున్న వంతెనకు కాపలాకాయమని సూచనలిచ్చాడు.

అజిమ్‌గఢ్ కోటలో బందీలుగా ఉన్న బ్రిటిష్ సైనికులను విడిపించాలంటే జనరల్ లుగార్డ్ నాయకత్వంలోని



సేనలు ఆ వంతెనను దాటుకుని రావాలి. తమ సేనలను నగరంలోకి జొరబడనీయకుండా చేయడానికి మాత్రమే కున్వర్ సింగ్ సేనలు తమను అడ్డుకుంటున్నాయని జనరల్ లుగార్డ్ భావించాడు. అయితే, దానివెనక వేరొక పథకం ఉన్న విషయం అతడు పసిగట్టలేక పోయాడు.

జనరల్ లుగార్డ్, అతడి సైనికులు ఎన్ని సార్లు ప్రయత్నించినా, పదవీచ్యుతుడైన రాజు కొద్దిపాటి సైనికులను దాటుకుని ముందుకు వెళ్ళలేక పోయారు. వంతెన మీద అడుగు పెట్టలేకపోయారు. అయితే, ఉన్నట్టుండి, పథకం ప్రకారం రాజుగారి సైనికులు వెనక్కు తగ్గడంతో బ్రిటిష్ సేనలు వంతెనదాటి ఆవలికి వెళ్ళగలిగాయి గాని, అక్కడ రాజుగారి సైనికులు ఒక్కరూ లేక పోవడం చూసి, ''ఏమిటీ మాయ!'' అని విస్తుపోయాయి.

కొందరు సైనికులు వంతెనవద్ద తమను అడ్డుకుంటూండగా; వృద్ధ రాజూ, సైనికులూ శత్రువుల కన్నుగప్పి ఘజిపూర్ మార్గం గుండా గంగాతీరాన్ని చేరుకుంటున్నారని తెలియవచ్చింది. వెంటనే బ్రిగేడియర్ డుగ్లా నాయకత్వంలో బ్రిటిష్ సేనలు వారి కేసి బయలుదేరాయి. మార్గమధ్యంలో అవి అక్కడక్కడ కున్వర్ అనుచరుల గెరిల్లా దాడులను ఎదుర్కోవలసి వచ్చింది. అయినా, త్వరితగతిలో వెళ్ళి ఒక గ్రామం వద్ద బసచేసి ఉన్నరాజుగారి సేనలను సమీపించాయి.

నిర్విరామ ప్రయాణం కారణంగా అలిసి పోయిన వృద్ధరాజు కున్వర్ సింగ్ ఏనుగులతో, భయంకర ఆయుధాలతో ముట్టడించిన బ్రిటిష్ సేనలను దీటుగా ఎదుర్కోలేక పోయాడు. ఓటమి తప్పదేమో అన్న పరిస్థితి సమీపించగానే రాజు, తన సహజమైన వ్యూహాలను అమలు పరిచాడు. సైనికులు పలు జట్లుగా విడిపోయి, విభిన్న మార్గాలలో తప్పించుకుని వెళ్ళి–ఒక నిర్దిష్ట ప్రదేశంలో, నిర్దిష్ట సమయంలో కలుసుకోవాలని ఆజ్ఞాపించాడు. అంతా అనుకున్నట్టే జరిగింది. రాజు సేనలతో గంగా తీరాన్ని సమీపించాడు. వెనక్కు తిరిగి చూస్తే దూరంలో బ్రిటిష్ సేనలు వస్తున్నట్టు తెలియవచ్చింది. కొద్దిపాటి సేనలతో అంత పెద్ద సైన్యాన్ని ఎదుర్కోవడం వివేకమనిపించలేదు. చాలినన్ని పడవలు లేకపోవడం వల్ల రాజూ, ఆయన అనుచరులూ బాలిల్లా సమీ



పంలో ఏనుగుల మీద ఎక్కి గంగా నదిని దాటనున్నారన్న వదంతిని వ్యాపింపజేశాడు. ఆ వదంతి ఆశించిన విధంగానే బ్రిటిష్ సేనాధిపతి చెవిన పడింది. తిరుగుబాటు నాయకుణ్ణి ఏనుగుతో సహా గంగలో ముంచే సమయం ఆసన్నమయిందని పొంగిపోయాడు.



హడావుడిగా సైనికులతో వెళ్ళి బాలిల్లా రేవు వద్ద రాజు రాకకోసం ఎదురు చూస్తూ పొదల చాటున మాటువేశాడు. అయితే, ఎంత సేపటికీ రాజు అటు కేసి రాలేదు. ఆ ప్రదేశానికి దిగువ ఏడుమైళ్ళ దూరంలోని శివపూర్ ఘాట్ వద్ద కావలసినన్ని పడవలతో నదిని దాటుతున్నట్టు వార్త అందింది. బ్రిటిష్ సేనలు హుటాహుటిగా అక్కడికి చేరాయి. అంతలో రాజుగారి సైనికులందరూ ఆవలి తీరు చేరారు. చివరగా రాజు వెళుతూన్న పడవ మాత్రం నదిలో సగం దూరంలో కనిపించింది. శత్రువుల తుపాకీగుండు ఆయన ఒకచేతి మణికట్టును ఛేదించడంతో రక్తం కారసాగింది. రాజు రెండవ చేత్తో కత్తిని ఎత్తి, ‘‘గంగామాతా! ఇదిగో నీ ముద్దుబిడ్డ సమర్పిస్తూన్న తుది కానుక!'' అంటూ ఆ చేతిని తెగ నరికి గంగాజలంలో పడేలా చేశాడు!

ఆ తరవాత ఆయన ఆవలి తీరం చేరి, ఎనిమిది నెలల క్రితం విడిచి వెళ్ళిన రాజధానిని చేరుకుని పాలనాపగ్గాలు చేపట్టాడు. అయితే, ఈ సంగతి అర్రాలో బసచేస్తూన్న బ్రిటిష్ సేనా నాయకుడు జనరల్ లీగ్రాండ్‌కు కంటకప్రాయమయింది. బలమైన బ్రిటిష్ సేనల నుంచి ఈ ముసలి రాజు ఎలా తప్పించుకుని అధికారాన్ని చేపట్టగలిగాడా అని ఆశ్చర్యపోయాడు. మళ్ళీ జగదీశ్‌పూర్ కేసి తన సేనలను నడిపించాడు. అయినా అజేయుడైన గాయపడ్డ వృద్ధ రాజు శత్రువులను ఎదుర్కొని నాశపరిచాడు. 1858 ఏప్రిల్ నెలలో ఆయన అధికారం మళ్ళీ నెలకొల్పబడింది. కొన్ని రోజుల తరవాత నరకబడ్డ చేతిగాయం సమస్య కారణంగా కాలధర్మం చెందాడు.

ఆయన అనంతరం తమ్ముడు రాజా అమర్ సింగ్ రాజయ్యాడు. ధైర్యసాహసాలలో, దేశభక్తిలో అన్నకు సాటి రాగల అమర్ సింగ్, తన కోట పతనమయ్యేంతవరకు బ్రిటిష్ వారితో యుద్ధం చేశాడు. ఆఖరికి కోట నుంచి తప్పించుకున్నాడు గాని, ఆ తరవాత ఆయనకు ఏమయిందో ఎవరికీ తెలియదు.

-(ఎకెడి)

# ఒక రోజు పయనం

శశాంక్ స్కూలు బస్సులో ఎక్కి కూర్చుంటూ, "మళ్ళీ ఒక చరిత్ర పాఠం. అందుకని ఒక ప్రయాణం. యమ బోరు!" అంటూ విసుక్కున్నాడు. "అవును, అదీ తరగతి గదిలో కాదు. ఎండలు మండే ఎడారి మధ్య!" అని వంత పాడాడు రాహుల్.

మోహన్ మాత్రం ఏమీ మాట్లాడలేదు. అతడికి చరిత్ర అంటే చాలా ఇష్టం. అందువల్ల ఈ ప్రయాణం విసుగనిపించలేదు.

అహ్మదాబాదులోని వాళ్ళ స్కూలు నుంచి స్టడీ ట్యూర్ అంటే అధ్యయన యాత్రకు వెళుతున్నారు. పురాతత్వశాఖ కనుగొన్న ఐదు వేల సంవత్సరాలకు పూర్వం వెలసిన సింధు నాగరికత అవశేషాల శిథిలాలు గల ధోలా విరాకు వెళుతున్నారు.

వాళ్ళను తీసుకువెళుతూన్న చరిత్ర ఉపాధ్యాయిని బస్సులో దారిపొడవునా సింధునాగరికత గురించిన విశేషాలు చెబుతూ వెళ్ళింది. ఒక్క మోహన్ మాత్రమే ఆమె చెబుతూన్న విషయాలను జాగ్రత్తగా వింటూ వచ్చాడు.

వాళ్ళు గమ్యాన్ని చేరాక బస్సుదిగి ఉపాధ్యాయిని వెనక నడవసాగారు. గ్రేట్ రాణ్ ఆఫ్ కచ్‌లో చుట్టూ బండలుగల ఎత్తయిన ఖాదిర్ దీవిలో ధోలావిరా ఉన్నది. ఆ ప్రాంగణం చాలా విశాలమైనది. కోటల్లాంటి భవనాలు శిథిలమైపోయినట్టు కనిపించాయి. పురాతత్వ పరిశోధన శాఖ తవ్వి వెలికి తీసిన దిబ్బ మీద అందరితో పాటు నిలబడ్డ మోహన్ పరిసరాలను పరిశీలనగా చూడసాగాడు.

"ఎందుకూ పనికిరాని ఎండి పోయిన ఇలాంటి చోట ప్రజలు ఎలా నివాసం ఏర్పరుచుకున్నారా?" అని ఆశ్చర్యపోయాడు. దూరంలో మెరిసే రాణ్ ఉప్పు ఎడారులు అతనికి కనిపించాయి. చుట్టుపక్కల నదులంటూ లేవు. వర్షపాతం కూడా మరీ తక్కువ. ఇక్కడ ఒకప్పుడు ప్రజలు నివసించారంటే ఆ తరవాత ఏదో జరిగి ఉండాలి. తన సందేహాన్ని బయటపెట్టాలనుకున్న మోహన్, "మేడమ్, సింధు నాగరి



కత నాటి ప్రజలు ఇలాంటి ఎండిపోయిన, నీళ్ళు లేని చోట ఎలా తమ నివాసాలు ఏర్ప రచుకున్నారు?'' అని అడిగాడు.

''చాలా మంచి ప్రశ్న అడిగావు మోహన్,'' అన్నది ఉపాధ్యాయిని చాలా మెచ్చుకుంటూ.

మోహన్ చాలా సంతోషించాడు. పిల్లలం దరి దృష్టి అతడి మీదికి మళ్ళింది.

''ఐదు వేల సంవత్సరాలకు పూర్వం ధోలా విరాను చేరుకోవడం అంత కష్టమేమీ కాదు. ఎందుకంటే ఆ కాలంలో మహారాణ్, చిన్న రాణ్ అరేబియా సముద్రం సాచిన రెండు చేతుల్లా ఉండేవి. ఆ జలాలలో చిన్న చిన్న పడవలు నడపడానికి వీలుండేది. ఈ నాటికి కూడా సముద్రమట్టానికి కొద్దిగా ఎత్తులో వున్న రాణ్ ఋతుపవనాలప్పుడు జలమయమై పోతూ ఉంటుంది. చాలా వరకు నీళ్ళు సముద్రం నుంచి వచ్చినవే గనక, అవి ఎండిపోగానే ఉప్పు టేరులు ఏర్పడతాయి,'' అని వివరించిన టీచర్ వాళ్ళను ముందుకు తీసుకువెళ్ళింది.

ఆ తరవాత ఆమె, ''ఇక రెండో విషయం ఏమంటే ఐదు వేల సంవత్సరాలకు పూర్వం ఇక్కడి నేల ఎంతో సారవంతంగా ఉండేది,'' అంటూ మళ్ళీ వివరించడం ప్రారంభించింది. రాహుల్, శశాంక్ తమలో తాము ఏవో మాట్లా డుకోసాగారు. శశాంక్ రాహుల్‌ను పట్టి తోయ డంతో వాడు కింద పడబోయాడు. వాణ్ణి పట్టు కుంటూ ఉపాధ్యాయిని, ''రాహుల్, ఐదు వేల సంవత్సరాల క్రితం ఇలా పడి ఉంటే నిన్ను కాపాడడానికి నేను ఈదుకుంటూ రావలసి ఉండేది,'' అన్నది.

ఆ మాటతో విద్యార్థులందరూ ఆమె కేసి విస్మయంతో చూశారు. వాళ్ళు నీటి చుక్క కనిపించని చోట నిలబడి ఉన్నారు. ఉపాధ్యా యిని ఈదుకుంటూ రావలసిన అవసరం ఏమిటి?

''ఇది ఒకప్పుడు నిర్మలమైన తాగునీరు అందించిన మన్సార్ నది ఎండి పోయిన ప్రదేశం. అంతే కాదు. మన్హార్ అనే మరొక నది ధోలావిరా దాటాక మన్సార్‌లో వచ్చి కలిసేది. ప్రజలు దానికి రాళ్ళతో ఆనకట్టలు కట్టి నదీ జలాలను హరప్పా పట్టణ తటాకాలకు మళ్ళిం చేవారు,'' అని వివరించింది ఉపాధ్యాయిని.

''ఆ మన్సార్, మన్హార్ నదులు ఇప్పుడే మయ్యాయి మేడమ్?'' అని అడిగాడు రాహుల్.

''దాదాపు ఐదు వేల సంవత్సరాలకు పూర్వం సింధులోయ ప్రాంతంలోని ప్రజలు వ్యవ సాయం చేయడం మొదలు పెట్టారు. క్రమేణా, వ్యవసాయం, పశుపోషణ ప్రధాన వృత్తులుగా మారాయి. వ్యవసాయ భూముల కోసం, వంటచెరకు కోసం, పశుపోషణ కోసం చెట్లను నరకడం ప్రారంభించారు. క్రమంగా అడవులు తరిగిపోసాగాయి. దాంతో వర్షపాతం తగ్గు ముఖం పట్టింది. భూగర్భజలాలు అడుగంట సాగాయి. మరి కొంత కాలానికి నదులు ఎండి



పోయాయి!'' అని వివరించిన ఉపాధ్యాయిని ఒక్క నిమిషం ఆగి, ''వేడిగాలులు ఎండి పోయిన నది ఇసుకను మోసుకెళ్ళి ఆ ప్రాంత మంతా చల్లేది. దీన్నే ఎడారిమయం కావడం అంటారు. అరకొర తడి ప్రాంతాలను అవి పూర్తి ఎడారులుగా మార్చేస్తాయి. ఇక్కడ ధోలావిరాలో హరప్పా అంతిమ దశలో అంటే 3,500 సం.లకు పూర్వమే ఎడారిమయం కావడం ఆరంభమయింది. ఇవాళ అది ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్నది!'' అని చెప్పి గాఢంగా నిట్టూర్చింది.

అదే సమయంలో దాపులనున్న గ్రామం నుంచి వారిని మధ్యాహ్న భోజనానికి పిలవడా నికి భోలా అనే స్థానిక గైడ్ వచ్చాడు.

పిల్లలందరూ అతడి వెంట బయలుదేరు తూండగా మోహన్ తనలో, ''మరింత ఎడారి మయం కావడాన్ని ఆపడానికి ఎవరూ ఏమీ చేయలేరా?'' అనుకుంటూ వారిని అనుస రించాడు.

ఆ గ్రామం అక్కడి వాతావరణానికి భిన్నంగా ఉండడం చూసి పిల్లలు ఆశ్చర్యపోయారు. అది పెద్ద గ్రామం. మనుషులూ, పెంపుడు జంతువులూ చాలా కనిపించాయి. చిన్న చిన్న పొదలతో పాటు చెట్లు కూడా ఉన్నాయి.

''ఈ గ్రామం పచ్చదనంతో చాలా సుభి క్షంగా కనిపిస్తున్నది. ధోలావిరాలా ఎండిపోయి లేదు,'' అన్నాడు రాహుల్ మోహన్‌తో.

''అవును, బాబూ,'' అన్నాడు గైడ్ భోలా. ఇద్దరు పిల్లలూ అతడి కేసి తిరిగి చూశారు. ''ఇప్పుడు మేము తగిన జాగ్రత్తలు తీసుకో లేదంటే కొన్నాళ్ళకు మా గ్రామం కూడా ధోలా విరాలా ఎండి పోగలదు! అయితే, అలా కాకుండా అడ్డుకోవాలని మేము దృఢ నిశ్చ యంతో ఉన్నాం. బావుల్లో లభించే నీరు తాగ



డానికీ, ఇళ్ళ అవసరాలకూ బొటాబొటిగా సరిపోతున్నాయి. ఇక వ్యవసాయం చాలా కష్టంగా ఉంటోంది. ఆవులు, గేదెలు, గొర్రెలు, మేకలు, గాడిదలు, ఒంటెలు పెంచుతున్నాం. రాణ్ సమీపంలో ఉమ్మడి మేత మైదానాలు ఏర్పరచుకున్నాం. గ్రామం చుట్టు పక్కల మొక్కలను మా జంతువులు మేయకుండా జాగ్రత్త పడతాం. అందువల్ల ఈ ప్రాంతానికే ప్రత్యేకమైన, విలక్షణమైన అసలు మొక్కలు, పచ్చదనం తగ్గిపోకుండా చూసుకోగలుగుతున్నాం. ఇక్కడికి అనువైన మొక్కలను, చెట్లను నాటి పెంచుతూ ఉంటాం,'' అని వివరించాడు భోలా.

భోజనం ముగించాక పిల్లలు భోలా వెంట వెళ్ళి గ్రామాన్ని చూశారు. గ్రామస్థులు కట్టెలకు బదులు ఆవుపేడను పిడకలుగా చేసి పొయ్యికి ఉపయోగించడం గమనించారు. వర్షపు నీరు వృథా కాకుండా ప్రతి బొట్టునూ ఎలా అపురూపంగా పొదుపు చేస్తారో తెలుసుకున్నారు. ''ఇక్కడ వ్యవసాయం చేయడానికి చాలినన్ని నీళ్ళను మునుముందు తప్పక సేకరించగలం,'' అన్నాడు భోలా ఎంతో ఆశగా. తమ భూమిని వ్యవసాయ యోగ్యం చేయడానికి గ్రామస్థులు పడుతూన్న శ్రమను చూసి పిల్లలు విస్తుపోయారు.

సాయంకాలం తిరుగు ప్రయాణానికి అందరూ బస్సెక్కారు. ఈ ప్రయాణం సరికొత్త అనుభవాన్ని కలిగించి తమ కళ్ళు తెరిపించాయని రాహుల్, శశాంక్ కూడా అంగీకరించారు. ''బోరుకొట్టే చరిత్ర పాఠం కాదు కదా?'' అంటూ మోహన్ చిన్నగా నవ్వుతూ, మిత్రుల కేసి మెరిసే కళ్ళతో చూశాడు. కాదు అన్నట్టు వాళ్ళూ నవ్వుతూ తలలూపారు.

## మన దేశం క్విజ్

ఈ నెల క్విజ్ మనదేశంలోని జంతువులకు, పక్షులకు సంబంధించినది



1. ఘూనా పక్షుల శరణాలయం ఎక్కడ ఉన్నది?



2. ఏ జంతువు రోమాల అడుగు భాగం నుంచి 'కాశ్మీరీ' ఉన్ని తయారు చేయబడుతున్నది?



3. సింహం సాధారణ ఆయుఃప్రమాణం ఎంత?



4. మన దేశంలో ఫ్లెమింగోలు ఎక్కడ కనిపిస్తాయి?



5. మనదేశంలో కస్తూరి జింకలు ఎక్కడ ఉన్నాయి?



6. అడవి గాడిదల అభయారణ్యం ఎక్కడ ఉన్నది?

(సమాధానాలు 74వ పేజీలో)

# ఒలింపిక్స్ : అంతగా తెలియని కొన్ని ఆసక్తికర విశేషాలు



## క్యూబెర్టిన్ ఆదుర్దా

ఆధునిక ఒలింపిక్ క్రీడల పితగా బ్యారన్ పీరీ డీ క్యూబెర్టిన్‌ను చెబుతారు. ప్రాచీన క్రీడలను మళ్ళీ ప్రారంభించడానికి ఆయన్ను ప్రేరేపించిన విషయం ఏమిటో తెలుసా? ఈ ఫ్రెంచి అరిస్టొక్రట్ చాలా మంది ఫ్రెంచి యువకులు బలహీనంగా ఉండడం గమనించాడు. అందుకే ఆంగ్లో-ఫ్రెంచ్ యుద్ధాల్లో ఫ్రాన్స్ ఓడిపోతూ ఉండేది! ఒలింపిక్స్ లాంటివి జరిపినట్టయితే, తమ యువకులను శక్తివంతులుగా తయారుకావడానికి ప్రోత్సహించినట్టవుతుందని ఆయన వాటిని ప్రారంభించాడు.

## విందు తరవాత

మహాసభ, విందు తరవాత ఇంటర్నేషనల్ ఒలింపిక్ కమిటీ ఏర్పాటయింది. ప్యారీస్‌లో క్యూబెర్టిన్ ఏర్పాటు చేసిన మహాసభకు పన్నెండు దేశాల నుంచి క్రీడాభిమానులు విచ్చేశారు. సమావేశానంతరం జరిగిన విందులో 2,000 మంది పాల్గొన్నారు. ఆ సభికులు మార్షియల్ మ్యూజిక్ విన్నారు. ఫెన్సింగ్ అండ్ రోయింగ్‌ను వీక్షించారు. బాణాసంచా వేడుకలతో విందు ముగిసింది. ఆ రోజు సాయంకాలం క్యూబెర్టిన్ కార్యదర్శిగా అంతర్జాతీయ ఒలింపిక్ కమిటీ ఏర్పాటయింది.

## పరధ్యానం

ఆధునిక ఒలింపిక్ క్రీడలు ఏథెన్స్‌లో ప్రారంభమయ్యాయని మనకు తెలుసు. ప్రాచీన క్రీడలు జరిగిన ఏథెన్స్‌లోనే ఆధునిక క్రీడలు కూడా మొదట జరగాలని గ్రీకులు పట్టుబట్టారు. మొదటి క్రీడలు పోటీల్లాగా కాకుండా ఉత్సవంలా జరిగాయి. ఆర్గనైజింగ్ కమిటీకి అధ్యక్షత వహించిన గ్రీకు రాజే విజేతలకు స్వయంగా బహుమతులు అందజేశాడు. సమాపక ఉత్సవంలో రాజు చివరగా ఉపన్యసించాడు. క్రీడలు ఘనవిజయం సాధించడానికి సాయపడిన ప్రతి ఒక్కరికీ కృతజ్ఞతలు తెలిపాడు. క్రీడాప్రాంగణానికీ, వివిధ దేశాల నుంచి విచ్చేసిన క్రీడాకారులకు భోజన, బస ఏర్పాట్లు చూసే బాధ్యతను నిర్వహించిన 'క్రౌన్ ప్రిన్స్'కు ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలియజేసి కూర్చున్నాడు. బ్యారన్ డీ క్యూబెర్టిన్‌కు కృతజ్ఞతలు చెప్పడం మరిచి పోయాడు. రాజుగారి పరధ్యానం అలాంటిది!



# నగలను ఎలుకలు తినేస్తే...

చాలాకాలం క్రితం రాజస్థాన్ లూనీ నదీ తీరంలోని ధానీ గ్రామంలో లక్ష్మణ్ అనే రైతూ, మనోహర్ అనే వ్యాపారీ ఇరుగు పొరుగున నివసిస్తూండే వారు.

ఒకసారి వరసగా రెండు మూడేళ్ళు వర్షాలు కురవక పోవడంతో నది పూర్తిగా ఎండిపోయింది. పంటలు పండక గ్రామస్థులు కరువును ఎదుర్కోవలసి వచ్చింది. నేలనే నమ్ముకున్న లక్ష్మణ్, అతడి భార్య కామిని తీవ్రమైన ఆలోచనలో పడ్డారు. దూర ప్రాంతానికి వెళ్ళి కొన్నాళ్ళపాటు వేరేదైనా జీవనోపాధిని వెతుక్కోవడం మంచిది అన్న నిర్ణయానికి వచ్చారు.

కామినికి ఉన్నట్టుండి తన పెళ్ళి సందర్భంగా పుట్టింటివాళ్ళు పెట్టిన బంగారు నగలు ఇంట్లో ఉండడం గుర్తుకు వచ్చి, ''నగలను ఇంట్లో పెట్టి వెళ్ళడం మంచిది కాదు. అలా అని మన వెంట తీసుకువెళ్ళడం కూడా క్షేమం కాదు కదా. ఏం చేయడం?'' అని భర్తను అడిగింది.

లక్ష్మణ్ కొంతసేపు ఆలోచించి, ''అవును, నువ్వు చెబుతున్నదీ నిజమే. నగలను ఒకసంచీలో వేసి కట్టి ఇవ్వు. దాచమని పక్కింటి మనోహర్‌కు ఇద్దాం. తిరిగి వచ్చాక తీసుకుందాం,'' అన్నాడు.

కామినికి కూడా అది మంచి సలహాగా అనిపించింది. పక్కింటి మనోహర్ తన భర్తతో ఎంతో అన్యోన్యంగా ఉంటాడు గనక, అతని వద్ద నగలు చాలా భద్రంగా ఉండగలవని భావించింది. వెంటనే నగలను ఒక సంచీలో వేసి మూటగట్టి తీసుకుని భర్తతో పాటు మనోహర్ ఇంటికి వెళ్ళింది. సమయానికి మనోహర్ ఇంట్లో లేడు. అతడి భార్య చిరునవ్వుతో పలకరిస్తూ బయటకు వచ్చింది.

''ఈ కరువు ఇంకా ఎంత కాలం ఇలాగే ఉంటుందో తెలియదు. మేము ధానీ వదిలి మరెక్కడికైనా వెళ్ళి కొంత కాలం ఉండి రావాలను





కుంటున్నాం. మేము తిరిగి వచ్చేంతవరకు ఈ మూటను మీ ఇంట్లో భద్రంగా దాచండి. ఇందులో నా నగలు ఉన్నాయి. వీటిని వెంట తీసుకువెళ్ళడం క్షేమంకాదు. తిరిగి వచ్చాక తీసుకుంటాం,'' అంటూ నగల సంచీని అందించింది కామిని.

అప్పుడే మనోహర్ అక్కడికి వచ్చాడు. లక్ష్మణ్ తన భార్య చెప్పిన మాటలను అతడు మనోహర్‌తో మళ్ళీ చెప్పాడు.

''నిశ్చింతగా వెళ్ళిరండి మిత్రమా. మీ నగలు మావద్ద క్షేమంగా ఉంటాయి,'' అన్నాడు మనోహర్. అతడి భార్య కూడా అదే మాట అన్నది.

సంతోషంగా ఇంటికి తిరిగి వచ్చిన లక్ష్మణ్, అతడి భార్య మరునాడు తెల్లవారు జామునే బయలుదేరి దూరంలోని మాలార్‌దేశ్ అనే గ్రామాన్ని చేరుకున్నారు. ఇన్నాళ్ళు వ్యవసాయం చేశాం కదా ఇప్పుడు ఇక్కడ చిన్నపాటి వ్యాపారం ప్రారంభిద్దామని లక్ష్మణ్ ఆ ఊళ్ళో ఒక ఇల్లు అద్దెకు తీసుకుని వెనకవైపున కాపురం ఉంటూ ముందు వైపున దుకాణం తెరిచాడు. భర్త సరుకులు కొనడానికి వెళ్ళినప్పుడు భార్య దుకాణంలో ఉంటూ వ్యాపారం గమనించసాగింది.

చూస్తూండగానే ఒక సంవత్సరం గడిచి పోయింది. ధానీ నుంచి వచ్చే వాళ్ళు ఇప్పుడు అక్కడ వర్షాలు కురుస్తున్నాయని చెప్పారు. అయినా లక్ష్మణ్ దంపతులు మరొక సంవత్సరం పాటు ఇక్కడే ఉండి వ్యాపారంలో కొంత కూడబెట్టాలనుకున్నారు. మరొక సంవత్సరంలో అనుకున్న దానికన్నా ఎక్కువగా సంపాదించుకుని, దుకాణాన్ని వేరొకరికి అమ్మేసి సంతోషంగా స్వస్థలానికి తిరుగు ప్రయాణమయ్యారు.

ఈ రెండేళ్ళలో ధానీలోని మనోహర్ మనసులో పేరాశ పేరుకు పోయి ద్రోహచింతన ఆరంభమయింది. పక్కింటి లక్ష్మణ్ తిరిగి వచ్చాడని తెలిసినా వెళ్ళి పలకరించలేదు. ఇల్లు సర్దుకోవడంలో తలమునకలైన లక్ష్మణ్ దంపతులు కూడా దాన్ని అంతగా పట్టించుకోలేదు. రెండు రోజుల తరవాత కామిని మనోహర్ ఇంటికి వెళ్ళి, అతడి భార్యను, ''అక్కయ్యా, నా నగలు ఇస్తావా?'' అని అడిగింది.

ఆ మాట వినగానే ఆమె కొంగును నోటికి అడ్డంగా పెట్టుకుని, భోరున ఏడ్వసాగింది. నిర్ఘాంతపోయిన కామిని వెంటనే తేరుకుని, ''ఏమయింది అక్కయ్యా?'' అని అడిగింది.

''ఏం చెప్పమంటావు కామినీ!'' అంటూ

ఆమె కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ, ''నగలన్ని టినీ చిట్టెలుకలు తినేశాయి. ఆ మాట మీతో చెప్పడానికే సిగ్గుగా ఉంది. అందుకే మిమ్మల్ని పలకరించడానికి కూడా మీ ఇంటికి మా ఆయన రాలేకపోయాడు,'' అన్నది ఏడుపు గొంతుతో.

కామిని మరేమీ మాట్లాడకుండా మౌనంగా తన ఇంటి కేసి నడిచింది. పొలం పనులు ముగించుకుని భర్త రాగానే విషయం చెప్పింది. ఇద్దరూ నింపాదిగా చర్చించుకుని పక్కింటి వారితో గొడవ పడకూడదనీ, సరైన సమయంలో తగిన గుణపాఠం నేర్పి తమ సొమ్మును రాబట్టు కోవాలనీ నిర్ణయించారు. లక్ష్మణ్ కొన్ని రోజులు మనోహర్‌ను అసలు చూడకుండానే ఉండి పోయాడు.

ఒకనాడు తనను చూడడానికి వచ్చిన లక్ష్మణ్‌తో, ''చూసి రెండేళ్ళయింది క్షేమమే కదా?'' అని అడిగాడు మనోహర్ నవ్వుతూ.

''క్షేమమే మిత్రమా! నీ సాయం కావలసి వచ్చింది. అడగవచ్చా?'' అన్నాడు లక్ష్మణ్.

''అడుగు మిత్రమా! స్నేహితుడితో సంకోచం దేనికి?'' అన్నాడు మనోహర్ ఆతృతగా.

''కామినికి హఠాత్తుగా జ్వర మొచ్చింది. వైద్యుడి వద్దకు తీసుకు వెళ్ళాలి. మేము తిరిగి వచ్చేంత వరకు వాకిట్లో ఎండబెట్టిన ధాన్యాన్ని చూసుకోవడానికి మీ అబ్బాయిని కాస్త పంపు తావా?'' అని అడిగాడు లక్ష్మణ్.

''తప్పకుండా పంపుతాను. అంతమాత్రం సాయపడకపోతే నేనేం మిత్రుణ్ణి?'' అంటూ మనోహర్ తన పదేళ్ళ కొడుకును లక్ష్మణ్ వెంట పంపాడు.

లక్ష్మణ్ పిల్లవాణ్ణి వెంటబెట్టుకుని పక్క గ్రామంలోని తన బంధువు ఇంట్లో వదిలి జాగ్రత్తగా చూసుకోమని చెప్పి వచ్చాడు. అక్కడ ఆడుకోవడానికి తన ఈడు వాళ్ళే ఉండడంతో పిల్లవాడు కూడా అక్కడ ఉండడానికి సంతోషంగా ఒప్పుకున్నాడు.

వెళ్ళిన బిడ్డ పొద్దుపోయాక కూడా రాకపోయే సరికి, మనోహర్ అతడి భార్య లక్ష్మణ్ ఇంటికి వెళ్ళి అడిగారు. వారిని చూడగానే కామిని బావురుమని ఏడుస్తూ, ''అయ్యో, ఏమని చెప్పను అక్కయ్యా! ఆ పాడు గద్ద బిడ్డను అమాంతం ఎత్తుకు పోయింది. ఈ విషాదకర మైన సమాచారాన్ని మీకెలా చెప్పడమా అన్న సిగ్గుతో, మా ఆయన మీ ఇంటికేసి రాలేకుండా ఉన్నాడు!'' అన్నది.



''ఏమిటీ! బిడ్డను గద్ద ఎత్తుకు పోయిందా?'' అంటూ ఆవేశపడ్డ మనోహర్, అతడి భార్య అక్కడి నుంచి వేగంగా గ్రామాధికారి వద్దకు వెళ్ళి లక్ష్మణ్ మీద ఫిర్యాదు చేశారు.

గ్రామాధికారి వాళ్ళిద్దరినీ వెంటబెట్టుకుని హుటాహుటిగా లక్ష్మణ్ ఇంటి వద్దకు వచ్చాడు. లక్ష్మణ్ గ్రామాధికారికి నమస్కరించాడు. ''మనోహర్ కొడుక్కి ఏమయిందో చెప్పు. పిల్లవాణ్ణి గద్ద ఎలా ఎత్తుకు పోతుంది?'' అని అడిగాడు గ్రామాధికారి.

''బంగారు నగలను చిట్టెలుకలు తినేసినట్టే, గద్ద పిల్లవాణ్ణి ఎత్తుకు పోయింది బాబూ. ఇందులో వింతేముంది?'' అన్నాడు లక్ష్మణ్.

''ఏమిటీ! బంగారు నగలను చిట్టెలుకలు తినేయడమా? ఇది మరీ విడ్డూరంగా ఉందే. నువ్వు ఏం చెబుతున్నావో నాకు అర్థం కావడం లేదు,'' అన్నాడు గ్రామాధికారి.

అప్పుడు లక్ష్మణ్ రెండేళ్ళ క్రితం తాము మనోహర్ భార్య చేతికిచ్చిన నగల గురించీ, వాటిని తిప్పి అడిగితే ఎలుకలు తినేశాయని ఆమె చెప్పిన విషయమూ గ్రామాధికారికి వివరించాడు. గ్రామాధికారి మనోహర్ కేసి చూశాడు నిజమా అన్నట్టు కోపంగా.

అతడూ, అతడి భార్యా సిగ్గుతో తలలు దించుకున్నారు. ఆ తరవాత మనోహరుడి భార్య, ''అయ్యా, నేను వెళ్ళి నగలను తెస్తాను. అవి మా ఇంట్లో భద్రంగా ఉన్నాయి,'' అంటూ తమ ఇంటికేసి నడిచింది.

''పిల్లవాడు కూడా మా బంధువు ఇంట్లో క్షేమంగా ఉన్నాడు. ఇప్పుడే వెళ్ళి వెంటబెట్టుకు వచ్చి మనోహర్‌కు అప్పగిస్తాను,'' అంటూ లక్ష్మణ్ కూడా బయలుదేరాడు.

''అత్యాశ హానికరం అని ఊరకే చెప్పలేదు. నమ్మకద్రోహం మహాపాపం. మనం ఒకరికి చెడు తలపెడితే మనకూ కీడే తప్ప మేలు జరగదు. గుర్తుంచుకో,'' అని మనోహర్‌ను హెచ్చరించి, గ్రామాధికారి అక్కడి నుంచి తన ఇంటి దారిపట్టాడు.



# చందమామ క్విజ్ - 4

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించిన ఈ నెల క్విజ్‌లో కొందరు నాయకులను, కొన్ని విశేషాలను గుర్తుచేసుకుందాం

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ క్విజ్ - 4 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. మే నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. జూలై 2008 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.

1. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన సమయంలో కాంగ్రెస్ అధ్యక్షుడు ఎవరు?
2. 1885లో భారత జాతీయ కాంగ్రెస్ ప్రథమ సమావేశం ఎక్కడ జరిగింది? ఎవరు అధ్యక్షత వహించారు?
3. ముగ్గురు కాంగ్రెస్ అధ్యక్షులు ఉత్తరోత్తరా రాష్ట్రపతి పదవులు అలంకరించారు. వారు ఎవరు?
4. భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్ష పదవిని చేపట్టిన తొలి మహిళ ఎవరు?
5. భారత జాతీయ కాంగ్రెస్ సంస్థాపకుడు ఎవరు? ప్రథమ అధ్యక్షుడు ఎవరు? 'కాంగ్రెస్' అనే పేరును సూచించిన వారెవరు?
6. గాంధీజీ మొట్టమొదట ఎక్కడ ఖైదు చేయబడ్డారు?
7. గాంధీజీ ఎక్కడి నుంచి క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభించారు? ఏ సంవత్సరంలో?
8. సంపూర్ణస్వరాజ్యాన్ని తన లక్ష్యంగా ఏ కాంగ్రెస్ సమావేశం ప్రకటించింది?





# పశుపతి మాన్యం

పశుపతి వాడవల్లి వేదపాఠశాలలో పదేళ్ళ వయసున్నప్పుడు చేరి వేదం నేర్చుకున్నాడు. ఇరవై సంవత్సరాలు వచ్చాక, నేర్చుకున్న విద్యతో ఏదో ఒక గ్రామంలో పురోహితుడిగా స్థిరపడి సంసారి కావాలని, గురువుల ఆశీస్సులు పొంది బయలుదేరాడు.

పశుపతి అలా ప్రయాణం చేస్తూ రాజవరం అనే గ్రామాన్ని సమీపిస్తూండగా, ఒక వ్యక్తి చేతిలో శివలింగంతో ఏటి నీటిలోకి దిగడం చూశాడు. పశుపతి ఆయన్ను ఆపి, ''అయ్యా, తమరు ఏమిటి చేయబోతున్నారు?'' అని అడిగాడు.

''మా గ్రామ శివాలయం శిథిలమై పోవడంతో పునర్నిర్మించి, పాత శివలింగం స్థానంలో కొత్తది ప్రతిష్ఠించాలని, కాశీ నుంచి ఈ శివలింగాన్ని తీసుకువచ్చాను. కాని ప్రతిష్ఠ సమయానికి తిరిగి రాలేక పోయాను. పాత శివలింగాన్నే ప్రతిష్ఠించారు. అందువల్ల ఈ శివలింగాన్ని జల నిమజ్జనం చేస్తున్నాను,'' అన్నాడు ఆ వ్యక్తి విచారంగా.

''అయ్యా, కాశీనుంచి తెచ్చిన శివలింగం తప్పక పూజార్హం కావాలి. ఒక దేవాలయంలో ఎన్ని శివలింగాలయినా ఉండవచ్చు. ఇది వేద ప్రమాణం. పాత దానితో పాటు దీన్ని కూడా ప్రతిష్ఠించండి. రెండు శివలింగాల గుడిగల గ్రామంగా మీ ఊరు పేరు పొందాలన్నది దైవసంకల్పమై ఉంటుంది. మీ గ్రామస్థులకు నేను వచ్చి చెబుతాను. పదండి ఊళ్ళోకి వెళదాం,'' అన్నాడు పశుపతి.

పశుపతి వేదప్రమాణంగా చెప్పిన మాటలు అందరికీ నచ్చాయి. రెండు శివలింగాల ప్రతిష్ఠ జరిగి నూతన దేవాలయం అందరినీ ఆకర్షించసాగింది. ప్రతిష్ఠ సమయంలో పశుపతి వేద మంత్రాలు వల్లించిన తీరు అందరినీ ఎంత

డా. జొన్నలగడ్డ మార్కండేయులు

గానో ఆకట్టుకున్నది. అతణ్ణి తమ గ్రామం లోనే ఉండిపొమ్మని కోరారు. కాశీ నుంచి శివలింగాన్ని తెచ్చిన పెద్దమనిషి పేరు పట్టెయ్య. పెద్ద భూస్వామి. తను తెచ్చిన శివలింగానికి గుర్తింపు తెచ్చిన పశుపతి తమ గ్రామంలోనే ఉండాలన్న కోరికతో ఒక ఎకరం పొలాన్ని అతనికి దానంగా ఇచ్చాడు. నా అన్న వాళ్ళు లేని పశుపతి రాజవరం గ్రామంలోనే స్థిర పడాలని నిశ్చయించుకున్నాడు.

శివలింగ ప్రతిష్ఠ జరిగాక ఐదు రోజుల పాటు ఉత్సవాలు జరిగాయి. ఆ సమయంలో శివాలయ పూజారి కుమార్తె దుర్గ శివలీలల కథాగానం చేసి భక్తులను ఎంతగానో అల రించింది. ఆఖరి రోజున ఆమె నందీశ్వరుడి కథ చెప్పింది. దాన్ని విని, ''కథ విన్నవారికి పాడి ఆవు, చెప్పిన వారికి చూడిఆవు ఇవ్వా లని అంటారు. చక్కని కథలు చెప్పిన పూజారిగారమ్మాయికి నేను చూడావును బహూకరిస్తాను,'' అంటూ బసవయ్య అనే పెద్దమనిషి ఆమెకు ఒక చూడి ఆవును కాను కగా ఇచ్చాడు.

బహుమతిగా ఇచ్చిన ఆవు మరికొద్ది సేపట్లోనే కవల కోడె దూడలను ఈనింది. నందీశ్వరుడే కోడెదూడల రూపంలో అవత రించి రెండు శివలింగాలకు నమస్కరించ దలిచాడని జనం భక్తితో పరవశించిపోయారు. నందీశ్వర ప్రతిరూపాలైన ఆ దూడలను శివార్పితంగా అచ్చోసి ఆబోతులుగా వది లెయ్యాలని చాలా మంది అభిప్రాయ పడ్డారు.



ఆ మాటలు విన్న గంగిరెద్దులవాడు ఊరి పెద్దలకు నమస్కరించి, ''అయ్యా, శివుడు నాట్యప్రియుడు. మా గంగిరెద్దుల ఆటకు ప్రసన్నుడయ్యాడేమో! మాకో దూడను ఇప్పిం చండి. దానికి ఆట పాట నేర్పి, యేటా శివ రాత్రి ఉత్సవాలకు తీసుకువస్తాం,'' అన్నాడు.

అయితే, అక్కడే ఉన్న పశుపతి, ''అది నాలుగేళ్ళ తరవాతి మాట. అప్పటికిగాని దూడలు పెద్దవి కావు. పైగా అవి పూజారి గారివి. ఆయన అభిప్రాయాన్నిమన్నించాలి కదా?'' అనడంతో అందరూ అవునంటూ అంతటితో ఊరుకున్నారు.

ఆ మరునాటి సాయంకాలం ఏటిగట్టున కూర్చుని వున్న పశుపతికి మరో ఊరికి తిరిగి వెళ్ళిపోతూన్న గంగిరెద్దులవాళ్ళు కనిపిం చారు. వాళ్ళ వెంట నాలుగయిదు గంగి



రెద్దులు ఉన్నాయి. వాటిలో ఒక కోడెదూడ నీరసంగాకుంటుతూ వెళ్ళడం గమనించిన పశుపతి మనసు కలత చెందింది. అది దీనంగా తనకేసి చూస్తున్నట్టు పశుపతికి అనిపించింది. మరి కొంతసేపటికి అతడి చూపు కొంత దూరంలో అప్పుడప్పుడు తల పైకెత్తి చూస్తూ పచ్చిక మేస్తున్న ఆబోతు మీదికి మళ్ళింది. అతడు లేచి దాని దగ్గరికి నెమ్మదిగా వెళ్ళి, పరిశీలనగా చూస్తూ ఆప్యాయంగా నిమిరాడు. ఆ తరవాత ఏటిగట్టుకు తిరిగి వచ్చాడు. ఆబోతు అతడి వెనకే మెల్లగా వచ్చింది.

ఏటిగట్టున పెద్ద రావిచెట్టు ఉంది. ఆ రోజు శనివారం కావడంతో రావిచెట్టును పూజించడానికి వచ్చిన పూజారి కూతురు దుర్గ పశుపతినీ, అతడి పక్కనే వున్న ఆబోతు ఒంటి మీది వాతలనూ చూసి, ''పాపం, ఏమిటిది?'' అని అడిగింది.

''ఏముంది! అంతా మనం చేసే పనులే,'' అంటూ నిట్టూర్చిన పశుపతి, కొంతసేపు మౌనంవహించి ఆ తరవాత, ''దేవలోకానికి కామధేనువులాంటిది భూలోకానికి పశు సంపద. పాడిపంటలకు అది మూలాధారం. మన పూర్వులు వాటిని దైవాలుగా భావించి పూజలు చేసేవారు. కొందరైతే దేవుడికి గోవుల రూపంలో మొక్కులు చెల్లించేవారు. అలా వచ్చిందే అచ్చోసి ఆబోతును వదిలే మన సంప్రదాయం. అచ్చోసి వదిలే కోడెదూడను అందరూ నందీశ్వరుడిగా భావించేవారు. ఇంటి గుమ్మంలోకి వస్తే చేటలో బియ్యం పోసి పెట్టేవారు. అది పంటచేల్లో పడి మేసినా కొట్టరు. కాని ఈ ఆబోతును ఎవరో చితక కొట్టారు. అదేవిధంగా గంగిరెద్దుల వారికిచ్చే కోడెదూడలను కూడా వాళ్ళు ఆటలు నేర్పడానికి వాటిని నానా హింసలు పెడతారు. కొడతారు. దారికి వచ్చేంత వరకు తిండి పెట్టకుండా మాడుస్తారు. ఈ విషయాలను తలుచుకుంటే బాధగా ఉంటోంది,'' అన్నాడు.

''అవును, వేదపండితులు కదా. తమ మాటకు తిరుగేముంటుంది? అయినా, ఇలాంటి దుస్థితి నుంచి వాటిని కాపాడడానికి కూడా తమరే ఏదో ఆలోచించాలి మరి,'' అంటూ అక్కడి నుంచి బయలుదేరింది దుర్గ.

ఆలోచనలో పడ్డ పశుపతి తెల్లవారే సరికి ఒక నిర్ణయానికి వచ్చి, గ్రామపెద్దను కలుసు

కుని, ''పట్టెయ్య నాకు దానంగా ఇచ్చిన పొలాన్ని పశుపోషణకు వినియోగించాలను కుంటున్నాను. గ్రామంలో తిరిగే ఆబోతుల అవసరాలు చూసుకుంటూ, గోశాలను ఏర్పాటు చేసి పశువులను శ్రద్ధగా మేపే రైతుకు ఆ పొలాన్ని కౌలుకు ఇస్తూ, అందులో వచ్చే ఆదాయాన్ని పశుపోషణకే వినియోగించేలా తమరు ఏర్పాటు చేయాలి,'' అని వేడుకున్నాడు.

''మరి నీ జీవనోపాధికి ఏంచేస్తావు?'' అని అడిగాడు గ్రామపెద్ద.

''ఆ పొలం నేను ఆశించి రాలేదు. భగవత్కృపవల్ల వచ్చిన ఆ పొలాన్ని నందీశ్వరుడి సేవకు వినియోగిస్తున్నాను. నేను నేర్చుకున్న వేదవిద్య ద్వారా ఆ పరమేశ్వరుడే నాకు ఏదో మార్గం చూపకపోడు. నేను ఈ రోజే మరో ఊరికి బయలుదేరుతాను,'' అన్నాడు పశుపతి.

అంతకు ముందే అక్కడికి వచ్చి అతడి మాటలు విన్న శివాలయ పూజారి, ''నాయనా పశుపతీ! వేద మంత్రాలతో పాటు గోసంపద మీద నీకున్న శ్రద్ధ ప్రశంసనీయం. నీకు అభ్యంతరం లేకపోతే నీలాంటి ఉన్నత వ్యక్తికి మా ఒక్కగానొక్క కూతురు దుర్గను ఇచ్చి వివాహం జరిపించడం భాగ్యంగా భావిస్తాను. నువ్వు వేరెక్కడికీ వెళ్ళనవసరం లేదు. మాతోనే ఉంటూ పౌరోహిత్యం చేసుకుంటూ సుఖంగా జీవయాత్ర సాగించవచ్చు,'' అన్నాడు.

''మీ కుమార్తెకు సమ్మతమైతే, సరస్వతీ కటాక్షం గల ఆమెను వివాహమాడడం నాకూ సంతోషమే,'' అన్నాడు పశుపతి చిన్నగా నవ్వుతూ.

మరుసటి ముహూర్తంలోనే ఊరి పెద్దల సమక్షంలో దుర్గ-పశుపతుల వివాహం నిరాడంబరంగా జరిగింది.

నూతన వధూవరులు బసవయ్య కానుకగా ఇచ్చిన ఆవు-దూడల పోషణను తామే స్వయంగా చూసుకోవాలనుకున్నారు. పశుపతి నిర్ణయాన్ని గ్రామప్రజలందరూ మెచ్చుకున్నారు. పశుపోషణకని అతడు ఇచ్చిన పొలానికి కాలక్రమంలో పశుపతి మాన్యం అనే పేరువచ్చింది.





# నరకవాసం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో ఒకప్పుడు బోధిసత్త్వుడు ఒక వానరంగా జన్మించాడు. ఈ వానరం పేరు 'నందీయుడు.' నందీయుడికి ఒక సోదరుడు న్నాడు. సోదరులిద్దరూ హిమాలయ ప్రాంతాలలో ఎనభైవేల కోతుల మందకు నాయకులుగా ఉంటూ వున్నారు. నందీయుడికి ఇంటి దగ్గర పోషించవలసిన తల్లి వున్నది. ఆమె పాపం అంధురాలు.

నందీయుడూ, తమ్ముడూ కలిసి రోజూ, వనాలలో దొరికే మంచి మంచి ఫలాలన్నీ పట్టుకువచ్చి, మందలోని సేవకుల ద్వారా తల్లికి పంపించేవాళ్ళు. ఐతే, ద్రోహులైన సేవకులు ఆ ఫలాలను తల్లికి అందివ్వక తామే కాజేస్తూ వచ్చారు!

ఒకనాడు నందీయుడు తల్లిని చూడ వచ్చాడు. ఆమెను చూసి ఆశ్చర్యపోయి, ''అమ్మా! ఏమిటిలా శుష్కించిపోయావు తిండి లేనట్టుగా? రోజూ మేం పంపే ఫలాలు తినటం లేదా?'' అని అడిగాడు.

''లేదు, నాయనా! ఫలాలూ లేవు, ఏమీ లేవు. తిండి ఉంటే ఎందుకిలా చిక్కిపోతాను?'' అని చెప్పింది తల్లి.

నందీయుడు బాగా ఆలోచించాడు. నిజం బోధపడింది. వెంటనే హిమాలయాలకు వెళ్ళి జరిగిందంతా సోదరుడికి చెప్పి, ''తమ్ముడూ! ఇంటివద్ద ఉండి నేను అమ్మపోషణ చూస్తాను. నువ్వు నాయకత్వం వహించి, ఈ మందను ఏలుకో,'' అన్నాడు.

అందుకు చిన్నవాడు, ''అన్నయ్యా! నీతో పాటు నేనూ ఇంటి దగ్గరనే ఉండి, అమ్మ పోషణ చూస్తాను,'' అన్నాడు.

ఈ విధంగా ఇద్దరూ ఏక మనస్కులై, ఇంటికి వెళ్ళారు. తల్లికి ఒక రావిచెట్టు మీద చక్కని బస అమర్చి, ఆమెకు ఏ కొరతా రాకుండా వేయికళ్ళతో కాపాడుతూ వచ్చారు.

జాతక కథ

ఇదిలా వుండగా ఒకానొక బ్రాహ్మణుడు తక్షశిలా నగరంలో గురువువద్ద విద్యలు అభ్యసిస్తున్నాడు. విద్యాభ్యాసం పూర్తి అయిన తరవాత అతడు గురువువద్దకు పోయి, సెలవిమ్మని అనుజ్ఞ కోరాడు.

ఆయన శిష్యుణ్ణి చూసి, ''నాయనా! నువ్వు విద్య పూర్తి చేసుకున్నావు. సంతోషమే. నీది తీవ్రస్వభావము. తొందర పడి ఎన్నడూ క్రూరమైన పనులు చేయబోకు, తరవాత పశ్చాత్తాపపడినా లాభం లేదు. ఇదే నా ఉప దేశం,'' అని చెప్పి దీవించాడు.

బ్రాహ్మణ కుర్రవాడు గురువువద్ద సెలవు తీసుకొని, కాశీనగరం చేరుకున్నాడు. పెళ్ళి అయింది, గృహస్థాశ్రమం స్వీకరించాడు. అతనికి ఏవిధంగానూ పొట్టపోసుకోవడానికి దారి కనబడలేదు. అందుచేత, విల్లమ్ములు చేతపట్టి బోయవాడి వృత్తి అవలంబించాడు. జంతువులనూ, పక్షులనూ వేటాడి, వాటి మాంసం విక్రయించి, ఆ వచ్చిన డబ్బుతో కాలక్షేపం చేస్తూ వచ్చాడు.

ఒక రోజున ఎంత తిరిగినా బోయవాడిలా మారిన బ్రాహ్మడికి ఒక్క జంతువు కూడా దొరకలేదు. ఇక లాభం లేదని ఇంటికి మరలి పోతూ, అతడు ఒక రావిచెట్టు కేసి చూశాడు. ఆ సమయాన చెట్టు కొమ్మలలో తల్లికి ఫలాహారం పెట్టి స్థిమితపరిచి, ఆమె వెనుకనే నందీయుడూ, తమ్ముడూ కూర్చుని వున్నారు. వాళ్ళూ బోయవాడిని చూశారు.

అప్పుడు చెట్టుకేసి చూస్తూ బోయవాడు, ఉత్త చేతులతో ఇంటికి మరలడమేమిటని



తలచి, తల్లి కోతికి బాణం గురిపెట్టాడు. దానిని నందీయుడు చూసి తమ్ముడితో, ''అదుగో, వాడు మన తల్లి కేసి బాణం గురి పెట్టాడు. ఆమె ప్రాణాలకు నేను అడ్డుపడ తాను. నేను పోయిన తరువాత ఆమెను నువ్వే రక్షించాలి!'' అంటూ చెట్టు దిగి వచ్చాడు.

''ఓయీ, బోయవాడా! మా తల్లిని చంపకు, ఆమె ముసలిది, కావాలంటే ఆమెకు బదులు నన్ను చంపు,'' అన్నాడు నందీయుడు.

అందుకు కఠినాత్ముడైన ఆ బోయవాడు 'సరే'నంటూ నిర్దాక్షిణ్యంగా నందీయుణ్ణి బాణంతో కొట్టాడు.

ఐతే, ఆ మాట మీద నిలబడక బోయ వాడు, నందీయుడు చనిపోగానే మళ్ళీ తల్లి కోతికి బాణం గురిపెట్టాడు. ఇది కనిపెట్టి, ఈసారి చిన్నవాడు దిగి వచ్చి బోయవాడితో, తన అన్న చెప్పినట్టే చెప్పాడు. 'సరే'నన్నాడు బోయవాడు. నిర్దాక్షిణ్యంగా చిన్నవాడిని కూడా చంపివేశాడు.

''నాకూ, నా కుటుంబానికీ ఈ రెండు కోతులూ చాలు,'' అని అనుకున్నాడు. కాని, మరుక్షణంలోనే అతడి మనసు మారిపో యింది. వాడు దయమాలి ఏమాత్రం పాప భీతి లేకుండా బాణంతో తల్లి కోతిని కూడా కొట్టి, కూల్చివేశాడు.

ఈ విధంగా ఆనాడు చంపిన మూడు కోతులనూ భుజాన వున్న కర్రకు వేలాడవేసి, ఇంటిముఖం పట్టాడు. ఊరి పొలిమేర చేరు కునేసరికల్లా–పిడుగుపడి వాడి ఇల్లు కాలి పోతున్నదనీ, వాడి భార్యా, ఇద్దరు బిడ్డలూ దానిలోనే ఉండిపోయారనీ తెలిసింది!

ఈ మాట చెవిని పడేసరికి, బోయవాడు చెప్పలేని దుఃఖంతో గుండెలు బాదుకుంటూ ఇంటికి పోయాడు. వాడు సాహసించి లోప లికి వెళ్ళేటప్పటికి, వాడు నించున్నచోట భూమి హఠాత్తుగా బద్దలయింది. వాడు పాతాళానికి కూరుకుపోతూ, ఈ సంగతి జ్ఞాపకం తెచ్చుకున్నాడు:

''నా గురువుగారు ఆనాడే చెప్పారు, క్రూరమైన పనులు చేయవద్దని–పశ్చాత్తాప పడినా లాభం ఉండదు సుమా అని. నేను చేసుకున్న పాపాలకు తగిన ప్రాయశ్చిత్తం అనుభవిస్తున్నాను...'' అనుకుంటూ మరి కనబడకుండా నరకవాసానికి పోయాడు.





# రామాయణం

సంపాతి తన తమ్ముడి మరణవార్త విని కన్నీరు కార్చుతూ, ''జటాయువును చంపిన ఆ దుర్మార్గుడు రావణుడి పైన పగ తీర్చుకుందా మన్నా నేను ముసలివాణ్ణి, రెక్కలు లేనివాణ్ణి, ఏం చేసేది? వెనక వృత్రాసురుడి వధ జరిగిన రోజుల్లో నేనూ, జటాయువూ పోటీ పడి ఒకరి కన్న ఒకరం వేగంగా ఎగురుతూ ఆకాశంలోకి వెళ్ళాం. మిట్టమధ్యాహ్నపు ఎండ తీక్ష్ణతకు తట్టుకోలేక జటాయువు వివశుడై సోలి పోయాడు. అప్పుడు నేను ప్రేమ కొద్దీ నా రెక్కలు చాచి వాడికి నీడ ఇచ్చాను. దానితో నా రెక్కలు మాడిపోయాయి. నేను సొమ్మసిల్లి ఈ వింధ్యపర్వతం పైన పడ్డాను. తరవాత నాకు నా తమ్ముడి సమాచారమే తెలియలేదు,'' అన్నాడు.

ఈ మాట విని అంగదుడు, ''అయ్యా, నువ్వు జటాయువు అన్నవైతే ఆ రావణుడు ఎక్కడ ఉంటాడో, ఎంత దూరాన ఉంటాడో చెప్పు,'' అన్నాడు.

''నాయనా, న్యాయానికి నేను స్వయంగా రామకార్యం చెయ్యవలసిన వాణ్ణేగాని, ముసలి వాణ్ణీ, అశక్తుణ్ణీ కావటంచేత వాక్సహాయ మైనా చేస్తాను. రావణుడు సీతను తీసుకుని పోయిన మాట నిజమే. అతడు లంకలో ఉంటాడు. అది ఇక్కడికి నూరామడల దూరాన సముద్ర మధ్యంలో ఉన్నది. లంక లోనే లంకా నగరం ఉన్నది. దాన్ని విశ్వకర్మ బంగారు ద్వారాలతో, బంగారు అరుగులతో, గొప్ప ప్రాకారాలతో నిర్మించాడు. ఆ లంకలోని రావణుడి అంతఃపురంలో సీత రాక్షస స్త్రీల

కిష్కింధా కాండ-7

మధ్య దుఃఖిస్తూ ఉన్నది. గద్ద జాతివాణ్ణి కావటంచేత ఇక్కడి నుంచే రావణుణ్ణీ, సీతనూ చూడగలుగుతున్నాను. మీ రక్కడికి వెంటనే వెళ్ళి నట్టయితే సీత తప్పక కనబడు తుంది,'' అన్నాడు సంపాతి.

అప్పుడు జాంబవంతుడు సంపాతితో, ''అయ్యా, సీతను రావణుడు ఎత్తుకుపోగా చూసింది ఎవరు?'' అని అడిగాడు.

మిగిలిన వానరులు సంపాతి చెప్పే మాట లను వినటానికి ఆసక్తితో ఎదురు చూశారు.

''ఆ కథ చెబుతాను వినండి. నేను కదల లేని వాణ్ణికావటంచేత నా కొడుకు సుపార్శ్వుడు రోజూ నియమం తప్పకుండా నాకు ఆహారం తెచ్చి ఇస్తూ ఉంటాడు. అలాటిది వాడు ఒక నాడు వేళమించి, సూర్యాస్తమయం అయినాక రావటమేగాక వట్టి చేతులతో వచ్చాడు. అసలే ఆకలి దహించుకుపోతూ ఉండటంచేత నేను వాణ్ణి బాగా తిట్టాను. నా కోపం పోగొట్టుతూ వాడు జరిగిన సంగతి చెప్పాడు. వాడు నా ఆహారం నిమిత్తం మహేంద్ర పర్వతం వద్ద జంతువులు నడిచే దారికి అడ్డంగా నిలిచి ఉన్నాడట. ఆ సమయంలో నల్లని శరీరం గల వాడొకడు సూర్యోదయంలాగా వెలిగిపోయే ఒక స్త్రీని తీసుకుపోతూ అటుగా వచ్చాడట. ఆ మగవాణ్ణీ, ఆడదాన్నీ నాకు ఆహారంగా తీసుకు వద్దామని సుపార్శ్వుడు ఆలోచిస్తుం డగా ఆ నల్లటివాడు చాలా మంచితనంగా దారి విడుమని కోరాడట. మర్యాదగా అడిగాడు గదా అని నా కొడుకు దారి ఇచ్చాడట. ఈ సంగతి తెలిసి అక్కడి మునులు సుపార్శ్వు డితో, 'ఇవాళ నువ్వు బతికి బయట పడటం నీ అదృష్టం! నిన్ను దారి అడిగినవాడు మరెవరో



కాదు, లంకానగరాన్ని ఏలే రావణుడు. వాడు ఎత్తుకు పోతున్నది రాముడి భార్య అయిన సీత!' అని అన్నారట. ఇదంతా జరగటం మూలాన వాడు నాకు వేళకు ఆహారం తీసుకు రాలేక పోయానని చెప్పాడు,'' అన్నాడు సంపాతి.

తరవాత సంపాతి తన తమ్ముడికి ఇన్ని నీళ్ళు విడిచి, స్నానం చేసి ఒక చోట కూర్చు న్నాడు. వానరులు అతని చుట్టూ చేరి కూచు న్నారు. సంపాతి మళ్ళీ వారితో ఇలా అన్నాడు:

''నేను సూర్యుడి వేడికి రెక్కలు కాలి ఇక్కడ పడిపోయానని చెప్పాను కాదూ? ఆరు రోజులపాటు నాకు స్పృహలేదు. ఆ తరవాత, నేను పడినది వింధ్య పర్వతం మీద అని తెలుసుకున్నాను. అప్పుడిక్కడ నిశాకర మహర్షి ఆశ్రమం ఉండేది. ఆయన గొప్ప తపస్వి. అదివరకే నేనూ, మా జటాయువూ ఆ మహర్షిని ఎరుగుదుము. నేను మెల్లిగా కాళ్ళీడ్చుకుంటూ ఆయన ఆశ్రమానికి వచ్చి ఆయన దర్శనం కోసం ఒక చెట్టు కింద నిలిచాను. కొంత సేపటికి ఆ మహర్షి స్నానం చేసి అటుగా వచ్చాడు. ఆయన తిన్నగా ఆశ్రమంలోకి వెళ్ళి, మళ్ళీ వచ్చి నన్ను చూసి నేను వచ్చిన పని అడిగాడు. నా దుస్థితికి కారణం ఏమిటన్నాడు. నన్ను గుర్తించాడు కూడా. నేనాయనతో జరిగినదంతా చెప్పాను. నాకు ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తున్నదని కూడా ఆయనతో అన్నాను. నాకు దుఃఖం ఆగలేదు. ఆయన కొంతసేపు కళ్ళు మూసి ధ్యాన నిమగ్నుడై, 'నీకు మళ్ళీ రెక్కలు



వస్తాయి, జవసత్వా లేర్పడతాయి. భవిష్య త్తులో దశరథుడనే రాజు పుట్టబోతాడు. అతని కొడుకు భార్యతో అరణ్యవాసం చేయవస్తాడు. వారు జనస్థానంలో ఉండేటప్పుడు రావణుడనే రాక్షసరాజు రాముడి భార్యను అపహరిస్తాడు. ఆమె కోసం వెతకమని రాముడు పంపగా వానరులు నువ్వుండే చోటికి వస్తారు. వారికి నువ్వు సీత సంగతి చెప్పు. నువ్వు ఎక్కడికీ పోలేవు గనక, ఇక్కడే ఉండటం మంచిది,' అన్నాడు. ఇదంతా ఎనిమిది వేల ఏళ్ళనాటి మాట. నాకీ సంగతి చెప్పిన నిశాకరమహర్షి నూరేళ్ళ అనంతరం దేహం చాలించాడు. నా మనసు అయోమయంలో పడిపోయింది. రావణుడు బలశాలి అయితేనేం గాక, ఆ దుర్మార్గుడు సీతను తీసుకుపోవటం నా కొడుకు కళ్ళారా చూశాడని తెలిసినప్పుడు,



'వాడితో పోరి సీతను విడిపించి ఉండవల సింది,' అని నా కొడుకును మందలించాను. నా తమ్ముడు ప్రాణాలు విడిచాడు. నా కొడుకు ఏమీ చేయనే లేదు. రావణుడు మహాపరాక్రమవంతు డనటానికి సందేహం లేదు. కాని మీరు తక్కువవాళ్ళు కారు. సుగ్రీవుడు సరి అయిన వాళ్ళనే ఎంచి పంపాడు. మీరు వెళ్ళినట్టయితే సీత తప్పక కనిపిస్తుంది. తరవాత రామలక్ష్మణుల బాణాలతో ఆ రావణుడు తప్పక చస్తాడు. వాడు నా తమ్ముడైన జటాయువును చంపినందుకు నా పగ కూడా తీరుతుంది.''

ఈ విధంగా సంపాతి వానరులతో చెబుతూండగానే అతనికి కొత్తరెక్కలూ, ఈకలూ మొలుచుకు వచ్చాయి. సంపాతి ఆనందంతో, ''చూశారా, నిశాకరమహర్షి చెప్పినది అక్షరాలా జరిగింది. మీరు వెళ్ళే పని జరుగుతుందని కూడా ఆయన అన్నాడు. అందుచేత మీకు కార్యసిద్ధి తప్పక అవుతుంది,'' అంటూ ఆకాశంలోకి ఎగిరాడు. ఇది చూసి వానరులు కూడా కొత్త ఉత్సాహంతో దక్షిణంగా బయలుదేరారు. సీత జాడ తెలిసిన సంతోషంతో వాళ్ళు గెంతారు, సింహనాదాలు చేశారు. ఈ విధంగా వెళ్ళి వారు దక్షిణ సముద్ర తీరాన్ని చేరుకున్నారు.

అంతులేని ఆ సముద్రాన్ని చూడగానే వానరులకు భయం పుట్టింది. ఆ సముద్రంలో నూరామడల దూరాన లంక ఉన్నది. దీన్ని ఎలా దాటటం? అంగదుడు మేటి వానరులను సమావేశపరిచి, ''మనం ఎలాగైనా ఈ సముద్రాన్ని దాటనిదే సీతాదేవిని చూడలేము. సీతను చూడకుండా తిరిగి

పోయే కన్న ఇక్కడ ప్రాయోపవేశం చెయ్యటం మేలు. సముద్రాన్ని చూసి భయపడి ప్రయోజనం లేదు. మీలో ఎవరెవరు ఎంతెంత దూరం దూకగలరో చెప్పండి,'' అన్నాడు.

సముద్రం దాటి లంకకు చేరగల ఘటికుడి పైన అందరి క్షేమమూ ఆధారపడి ఉన్నది. గజుడు పది ఆమడల దూరం దూకగలనన్నాడు. గవాక్షుడు ఇరవై ఆమడలూ, గవయుడు ముప్ఫై ఆమడలూ దూకగలమన్నారు. నలభై ఆమడలు దూకగల నన్నాడు శరభుడు. గంధమాదనుడూ, మైందుడూ, ద్వివిదుడూ వరసగా యాభై, అరవై, డెబ్భై ఆమడలు దూకగల మన్నారు. సుషేణుడు ఎనభై ఆమడలు దు కగలనన్నాడు. జాంబవంతుడు, ''ఒకప్పుడు నేను ఎంత దూరమైనా దూకేవాణ్ణి. త్రివిక్రముడు వామనావతారమెత్తి మూడడుగులతో మూడు లోకాలూ ఆక్రమించినప్పుడు నేను అతని చుట్టూ ప్రదక్షిణం తిరిగి వచ్చాను. ఇప్పుడు ముసలివాణ్ణి, తొంభై ఆమడలు మించి దూకలేను,'' అన్నాడు.

అందరన్న మాటలూ విని అంగదుడు, ''నేను నూరు ఆమడల దూరం సులువుగానే దూక గలను. కాని తిరిగి రాగలనని నిశ్చయంగా చెప్పలేను,'' అన్నాడు.

ఆ మాట విని జాంబవంతుడు, ''నాయనా, మాకు రాజువంటి వాడవు. నువ్వు మాలో ఒకణ్ణి, లంకకు పంపవచ్చు గాని, నిన్ను మేమెలా పంపుతాము? అది పొసగదు,'' అన్నాడు తల అడ్డంగా ఊపుతూ.



'నేనూ వెళ్ళక, మీలో వెళ్ళేవారూ లేకపోతే ఇక మనకు ప్రాయోపవేశమేగదా గతి?'' అన్నాడు అంగదుడు.

''నాయనా, ఆ విషయం గురించి నువ్వేమీ విచారించకు. మన పని సానుకూలం చెయ్య గల మహామహుడు అడుగో దూరాన ఒంటరిగా కూచున్నాడు,'' అంటూ జాంబవంతుడు హనుమంతుణ్ణి చూపాడు.

అతడు హనుమంతుడి వద్దకు వెళ్ళి, ''మేమంతా తలలు పగల గొట్టుకుంటూ ఉంటే మాకందరికీ మేటియైన నువ్వు ఉలుకూ, పలుకూ లేకుండా ఇక్కడ ఒంటిగా కూర్చున్నావేమిటి? పుట్టుతూనే సూర్యుణ్ణి చూసి పండనుకుని ఆకాశాని కెగిరిన వాడవుకదా, నువ్వు కాక ఈ మహాసముద్రాన్ని మరెవరు దాట గలరు? వేగంలో వాయువుకు సమానమైన వాడవు, గరుత్మంతుడికి తీసిపోనివాడవు. ఎగరటంలో నీకు సరి వచ్చేవాళ్ళు మాలో ఎవరున్నారు? నీ ప్రజ్ఞ చూడటానికి ఈ వానరులంతా ఆత్రంగా ఎదురు చూస్తున్నారు. మరి లే! లేచి నీ శక్తి చూపించు!'' అని ఉత్సాహపరిచాడు.

ఈ మాటలు వింటూంటే హనుమంతుడి శరీరం పొంగిపోయింది. హనుమంతుడి శరీరం పెరిగి పోతున్న కొద్దీ వానరులు ఉత్సాహాతిశయంతో సింహనాదాలు చేశారు. వారి ప్రశంసలు వింటున్న కొద్దీ హనుమంతుడి బలం కూడా పెరగ సాగింది. ఆ ఉత్సాహంలో అతడు, ''ఔను, ఈ సముద్రాన్ని అవలీలగా దాటుతాను. కావలిస్తే నేను సూర్యుడితో బాటు తూర్పు నుంచి బయలుదేరి పడమరకు వెళ్ళి మధ్యాహ్నానికల్లా సూర్యుడికి ఎదురు రాగలను. శుభ శకునాలు కలుగుతున్నాయి. మనసెంతో ఉత్సాహంగా ఉంది. నేను సీతాదేవిని తప్పక చూసి వస్తాను. మీరేమీ దిగులు పడకండి,'' అన్నాడు.

తాను భూమిని తన్ని పైకి లేచేటప్పుడు భూమి కంపిస్తుందనే ఉద్దేశంతో హనుమంతుడు సమీపంలో ఉన్న మహేంద్రపర్వత శిఖరాన్ని ఎక్కాడు. అతను అక్కడ నడుస్తుంటే అతడి పాద ఘట్టనకు రాళ్ళు పిండి అయ్యాయి, మహేంద్రగిరిపై ఉండే జంతువులు భయపడి నలు దిక్కులకూ పారిపోయాయి. [కిష్కింధాకాండ సమాప్తం]





# సారంగుడి వైరాగ్యం

సుదర్భదేశంలో అన్నిరకాల దురాచారాలూ ఉండేవి. అంటరానితనం ఉండేది. పంచములనే వారిని ఊరికి దూరంగా ఉంచే వాళ్ళు. ఆడపిల్లలకు బోలెడు కట్నాలు పోస్తేగాని పెళ్ళిళ్ళు అయ్యేవికావు. అధికార్లు లంచాలు మరిగారు. ఉన్నవాళ్ళూ, లేని వాళ్ళూ కూడా తాగుడు మరిగి, డబ్బు తగలేసు కుని, ఆరోగ్యాన్ని కూడా కోల్పోయేవారు.

సుదర్భదేశంలో సారంగుడనే మహాత్ముడు ఉండేవాడు. దేశంలో దురాచారాలు పోగొట్టా లంటే ప్రజలలో హెచ్చుగా ఉన్న నిరక్షరత నిర్మూలించాలని తీర్మానించుకుని; అక్షరా స్యత పెంచడానికీ, దురాచారాల నిర్మూల నకూ పెద్ద ఎత్తున ఉద్యమం లేవదీశాడు. తన ఉద్యమాన్ని చాలా మంది వ్యతిరేకించినా ఆయన లక్ష్యపెట్టలేదు. యువకులు అధిక సంఖ్యలో ఆయనను బలపరిచారు. రాజు ఆ ఉద్యమాన్ని అణచటానికి యత్నించాడు. సైనికులు కూడా ప్రజలతో చేరిపోయి, రాజును పడగొట్టారు. సారంగుడే దేశానికి రాజుకావాలని ప్రజలు ఏకకంఠంగా కోరారు.

అయితే, సారంగుడికి రాజ్యకాంక్షలేదు. ఆయన తన అనుచరులలో ముఖ్యుడైన చరితార్థుడు అనేవాణ్ణి రాజుగా చేసి, ప్రజలలో ఎలాటి దురాచారాలు తల ఎత్తకుండా చూసుకోవాలో చెప్పి, తపస్సు చేసుకుంటా నని అడవులకు వెళ్ళిపోయాడు. ఆయన అడవులలో ఆశ్రమం కల్పించుకుని, పది హేనేళ్ళు గడిపినాక, సుదర్భదేశం ఇప్పుడెలా ఉన్నదో తెలుసుకోవాలనిపించింది.

సారంగుడు చరితార్థుడి వద్దకు ఒక శిష్యుణ్ణి పంపి, తనకు దేశపరిస్థితి చూడాలని ఉన్నట్టు కబురు చేశాడు. ఈ కబురు అందగానే చరితార్థుడు రథం మీద సారంగుణ్ణి చూడ

25-ఏళ్ళనాటి చందమామ కథ



వచ్చాడు. సారంగుడు తన ఆశ్రమాన్ని శిష్యులకు అప్పగించి, చరితార్థుడి వెంట వెళ్ళాడు.

సుదర్భదేశంలో సారంగుడికి గొప్ప స్వాగతం లభించింది. సారంగుడు పర్యటనచేసేటప్పుడు చరితార్థుడు ఆయన వెంట ఉన్నాడు. సారంగుడు కారాగారానికి వెళ్ళి అక్కడ ఉన్న ఖైదీలను చూసి, వివరాలు అడిగాడు. వారిలో కట్నాలు తీసుకున్నవారూ, తాగినవాళ్ళూ, లంచం తీసుకున్న ఉద్యోగులూ, ఇతర నేరాలు చేసినవాళ్ళూ ఉన్నారు.

''రాజభటులు వెయ్యికళ్ళతో నేరస్థులను పట్టుకుంటున్నారు. అందుచేత నేరాలు చేసి, శిక్షపడకుండా తప్పించుకోవటం కష్టమైపోతున్నది,'' అన్నాడు చరితార్థుడు.

''వీళ్ళు ఎంతకాలంగా కారాగృహంలో ఉన్నారు?'' అని సారంగుడు అడిగాడు.

''మీ ఆశయాల దృష్ట్యా శిక్షలు మరీ కఠినంగా ఉండకుండా చూస్తున్నాం. ఇలాటి నేరాలకు ఆరు మాసాలు మించి శిక్షఉండదు. వీళ్ళు ఇక్కడికి వచ్చి వారంరోజులు అవుతుందనుకుంటాను,'' అన్నాడు చరితార్థుడు.

సారంగుడు ఉలిక్కి పడి, ''ఇంక ఇక్కడి నుంచి వెళ్ళిపోదాం,'' అన్నాడు.

ఆ తర్వాత ఇద్దరూ ఒక కల్యాణ భవనం లోకివెళ్ళారు. ''కులాంతరవివాహాలు చేసుకునేవారికే ఈ భవనంలో సదుపాయాలుంటాయి. వర్ణాంతరవివాహాలను ప్రోత్సహించటానికి ఈ భవనం నిర్మించాం. ఇప్పటికి ఇందులో వందకు పైగా పెళ్ళిళ్ళు జరిగాయి. ప్రతి వివాహానికీ వెయ్యివరహాలు బహుమతి ఇస్తూంటాను. పదిరోజుల క్రితమే ఇందులో ఆఖరి పెళ్ళి జరిగింది...''

ఇలా చరితార్థుడు ఉత్సాహంగా ఒకటొకటే చెప్పుకుపోతుంటే, సారంగుడు కళ్ళు తుడుచుకున్నాడు. అవి ఆనందబాష్పాలు కాబోలుననుకున్నాడు చరితార్థుడు.

అక్కడి నుంచి ఇద్దరూ క్రీడాస్థలాలకు వెళ్ళారు. అక్కడ ఎందరో ఆడుతున్నారు.

''మహాత్మా చూశారా, మీరు కోరినమార్పు ఈ దేశంలో ఎంత త్వరగా వచ్చిందో!'' అన్నాడు చరితార్థుడు.

''ఏమిటా మార్పు?'' అని సారంగుడు అడిగాడు.

''ఇక్కడ ఆడుకునే వారిలో అగ్రవర్ణులతో బాటు పంచములనే వారు కూడా ఉన్నారు,'' అన్నాడు చరితార్థుడు.

''వీరిలో పంచములున్నారని నీకు ఎలా తెలుసు?'' అని సారంగుడు అడిగాడు.

''ఇక్కడ సవర్ణులూ, పంచములూ ఆడుకోవాలి. అందుకే ఈ స్థలం ఏర్పాటు చేసి, అంటరానితనాన్ని నిర్మూలిస్తున్నాం. తేడా తెలీటంకోసం అగ్రవర్ణులు నీలం రంగు దుస్తులూ, పంచములు పచ్చ దుస్తులూ ధరించి, కలిసి ఆడుకుంటారు,'' అన్నాడు చరితార్థుడు.

ఆ మాటలు వింటూనే సారంగుడి కళ్ళు నీళ్ళుకమ్మి, ఎటు చూసినా ఆయనకు ఏమీ కనబడలేదు.

''రేపు మనం దేశపర్యటన ఆరంభింతాం,'' అన్నాడు చరితార్థుడు.

''చూసినది చాలు. నాలో పర్యటన చెయ్యాలన్న కోరిక నశించింది. నా తిరుగు ప్రయాణానికి ఏర్పాటు చెయ్యి,'' అన్నాడు సారంగుడు.

''అదేమిటి, స్వామీ?'' అన్నాడు చరితార్థుడు ఆశ్చర్యంగా.

''దేశంలో పంచములనే మాట వినబడరాదనుకున్నాను. అంటరాని తనం ప్రజలకు ఇంకా తెలియటమూ, వారితో కలిసి తిరగటం ఇంకా గొప్పగా భావించబడటమూ జరుగుతున్నది! వర్ణాంతర వివాహాలకు ప్రభుత్వం బహుమతులిస్తున్నదంటే, ప్రజలు అలాటి వివాహాలను ఇంకా ప్రారంభించ లేదన్న మాట! కట్నాలూ, తాగుడూ, లంచ గొండితనమూ ప్రజలలో ఇంకా పోలేదు. రాజువైన నువ్వు ఈ మాత్రం గ్రహించక ఏదో సాధించాననుకుని గర్వపడుతున్నావు! దురాచారాలు చట్టాలతో పోవు. ప్రజల మనస్సుల్లో పరివర్తన తీసుకు రావాలి. నా శిక్షణలో ప్రజానాయకుడివైన నీ పరిపాలనలోనే పరిస్థితి ఇలాగుంటే, ఇంకొకరు రాజై ఇంతకన్న హెచ్చుసాధిస్తారన్న ఆశ నాకులేదు. నిన్ను సరి అయిన ప్రజానాయకుడుగా భావించిన నా నిర్ణయం తప్పు! ఒకసారి తప్పుచేశాక మళ్ళీ తప్పుచేయనని నమ్మక మేమిటి? అందుకే నాకు విరక్తి కలిగింది. నీకు తోచిన విధంగా నువ్వు రాజ్యం ఏలు. నేను నా ఆశ్రమానికి పోతాను. మళ్ళీ సుదర్భదేశంలో అడుగు పెట్టను,'' అన్నాడు సారంగుడు.



చిత్రాలు: గాంధి అయ్యా 28

# అజేయుడు గరుడుడు!

గుహాలయానికి వెళుతూన్న ఆదిత్యుడికి కోయయువకుడు మార్గ మధ్యంలోని గిరిజామాత ఆలయం చూపాడు. ఆదిత్యుడు లోపలికి వెళ్ళి ధ్యానంలో కూర్చున్నాడు. అతనికి దివ్యస్వరం వినిపించింది. విగ్రహంలో కనిపించిన గరుడుడి రూపం అతనికి రక్షణ, విజయం తథ్యం అని ఆశీర్వదించింది.

ఆదిత్యుడి వెంటవచ్చిన కోయయువకుడు అద్భుత ప్రకాశం చూసి భరించలేక స్పృహ కోల్పోయాడు.

ఆలయం లోపల...






ఆశీర్వదించబడ్డ శక్తులన్నిటినీ ఆదిత్యుడు అందుకున్నాడు.



లేచి ఆలయం వెలుపలికి వచ్చిన అతడు ఆలయం మీద ప్రదక్షిణగా తిరుగుతూన్న డేగను చూశాడు.



స్పృహలోకి వచ్చిన కోయయువకుడు లేచి ఆలయంలోకి వెళ్ళాడు.




అతడు తన నాయకుడి వద్దకు పరిగెత్తుకుపోయాడు.












విల్లంబులతో, ఈటెలతో బయలుదేరడానికి యువకులదండు త్వరలో ఆయత్తమయింది.

అక్కడ గుహాలయంలో యజ్ఞం జరుగుతోంది. పూజారి అగ్నిగుండంలోకి కోడిపిల్లలను పడేస్తున్నాడు. మంటలు చెలరేగాయి...



పూనకం వచ్చినవాడిలా పూజారి కేకలు పెట్టసాగాడు.




భూతవైద్యుడు రవీంద్రదేవుడి కేసి తిరిగాడు.




మనుషుల కోసం రవీంద్రదేవుడు
వెలుపలికి వచ్చాడు.


భూతవైద్యుడు దిగ్భ్రాంతి
చెందాడు.
ఈ ప్రకాశవంతమైన మానవ
రూపం నాకేసి వస్తున్నదేమిటి?


హఠాత్తుగా డేగ
ఎగిరి వెళ్ళి...


...వృత్తాకారంగా
తిరుగుతూ...


నాగబంధు చితాభస్మం ఉన్న పాత్రను ఎత్తుకుని పైకి
ఎగిరి వెళ్ళి...


...అగ్ని గుండంలో
దభీమని పడవేసింది.


ఢాం అనే భయంకర శబ్దం అక్కడున్న
వారిని భయభ్రాంతుల్ని చేసింది.


మంటల నుంచి భయంకర ఆకారం వెలుపలికివచ్చింది.


ఆ ఆకారం ప్రకాశవంతమైన రూపం మీదికి వెళ్ళింది.
రా! నీ అంతం చూస్తాను!


రెండు రూపాల మధ్య భీకరయుద్ధం ఆరంభమయింది.


ఆలయం నుంచి భయంకర శబ్దాలను, కేకలను నరేంద్రదేవుడు విన్నాడు.
యుద్ధమా? ఎవరెవరి మధ్య?


హడలిపోయిన నరేంద్రదేవుడు అక్కడి నుంచి దూరంగా పారిపోవాలనుకున్నాడు. అయినా...


...ఏదో అడ్డుతగలడంతో అగ్ని గుండం మంటల్లోకి పడిపోయాడు.
(ఇంకావుంది)

# సాంచీ స్థూపం

భోపాల్‌కు నలభై అయిదు కి.మీ. దూరంలో సాంచి ఉన్నది. ఇక్కడున్న స్థూపం మన దేశం లోని సుప్రసిద్ధ బౌద్ధ యాత్రా కేంద్రాలలో చాలా ముఖ్యమైనది. ఇది యేటా లక్షలాది బౌద్ధ మతానుయాయులను ఆకర్షిస్తోంది. ముఖ్యంగా మే నెలలో వచ్చే బుద్ధ జయంతి (వైశాఖ పూర్ణిమ) నాడు వేలాది మంది భక్తులు ఈ స్థూపాన్ని సందర్శిస్తారు.

బౌద్ధ మతాన్ని స్వీకరించిన అశోక చక్రవర్తి (క్రీ.పూ. 273-236) విదిశా యువరాణిని వివాహమాడాడు. విదిశా నగర సమీపంలో 12మీ. ఎత్తయిన రాతి స్థూపాన్ని నెలకొల్పి దాని మీద సూక్తులను చెక్కించాడు. రాతి స్తంభానికి పక్కన చుట్టూ కొయ్యపట్టాతో వున్న ఇటుకల స్థూపాన్ని క్రీ.పూ. 2వ, 1వ శతాబ్దానికి చెందిన సుంగ వంశస్థులు నిర్మించి విస్తృత పరిచారు. సాంచిలో ప్రధానమైన నిర్మాణం ఇది. 36.6మీ. వ్యాసం, 16.46 మీ. ఎత్తుతో వలయాకార గుమ్మటం నిర్మించబడి ఉన్నది. గుమ్మటం చుట్టూ నాలుగు వైపులా నాలుగు అద్భుతమైన అలంకార చెక్కడాలత నిండిన నాలుగు ద్వార తోరణాలు ఉన్నాయి. ఒక్కొక్క ద్వార తోరణానికీ రెండు స్తంభాలూ, వాటి మధ్య వాటిని కలుపుతూ మూడు అడ్డు పట్టాలూ ఉన్నాయి. ఆ పట్టాల మీదా, స్తంభాల మీదా బుద్ధ జాతక కథలు అందమైన శిల్పాలుగా మలచబడి ఉన్నాయి.

సాంచిలో సుంగ వంశస్థుల కాలానికి చెందిన మరి రెండు స్థూపాలు కూడా ఉన్నాయి. ఆ తరవాతి కాలంలో స్థూపాల చుట్టూ ఆరామాలూ, మఠాలూ, ఆలయాలూ నిర్మించ బడ్డాయి. అవన్నీ కాలక్రమంలో ఉదాసీనతకులోనై శిథిలావస్థను చేరుకున్నాయి. 1818లో జనరల్ టేలర్ అనే బ్రిటిష్ ప్రముఖుడి ప్రోత్సాహంతో త్రవ్వకాలు ప్రారంభమయ్యాయి. ఆఖరికి 1912-19 మధ్య కాలంలో సర్ జాన్ మార్షల్ కట్టడాలకు ప్రస్తుత స్థితిని కలిగించాడు.

యునెస్కో సాంచీని ప్రపంచ వారసత్వ స్థలంగా ఎంపిక చేస్తూ, ''నాలుగు ద్వార తోరణాల మీది అందమైన శిల్పాల అలంకారాన్ని'' ప్రత్యేకంగా ప్రశంసించింది. సాంచీలోని భవనాలు వాటి ''ప్రాచీనత, నాణ్యత'' దృష్ట్యా చాలా విలక్షణమైనవి అని కొనియాడింది.



# వార్తలలో బాలలు

## బుల్లి రచయిత్రి



చెన్నయ్‌లోని చెట్టినాడు విద్యాశ్రమ్‌లో ఒకటవ తరగతి చదువుతూన్న ఆరేళ్ళ అర్చనా శ్రీరాములు అనే పాపాయి 'మై జర్నీ టు జపాన్' (నా జపాను ప్రయాణం) అనే పుస్తకం రాసేసింది! జపానులో ఉద్యోగం చేస్తున్న తన తండ్రి వద్దకు వెళ్ళి వచ్చాక అర్చన ఆ పుస్తకం రాసింది. ''చూసిన ప్రాంతాలన్నీ నాకు నచ్చాయి. ముఖ్యంగా నేనూ, మా అన్నయ్యా ఆడుకున్న డిస్నీ ల్యాండ్, ఈనో జూ, షినాగ్వా అరియం, ది మెరీన్ మ్యూజియం, ఇతర ప్రాంతాలు బావున్నాయి,'' అంటుంది అర్చన. ఆ పాపాయి చూసిన వాటిని కళ్ళకు కట్టినట్టు, 'నిజాయితీగా' తన భావాలను వెల్లడించడానికి సరైన పదాలను ఎంపిక చేసుకున్నదని ఆమె టీచర్లు చెబుతున్నారు.

## క్విజ్ చాంపియన్



భారతదేశంలో పుట్టిన పదేళ్ళ డేవిడ్ వర్గీస్ బిబిసి క్విజ్ షో జూనియర్ మాస్టర్ మైండ్‌లో అతి పిన్నవయసు చాంపియన్ అయ్యాడు. అతడు క్విజ్ ప్రోగ్రామ్‌లో చేరినప్పుడు జురాసిక్ పార్క్ ట్రయాలజీని తన స్పెషల్ సబ్జెక్టుగా తీసుకున్నాడు. ఫైనల్స్‌కు 'స్టార్ వార్స్' దర్శకుడు జార్జ్ లూకాస్ జీవితాన్ని, కృషిని తీసుకున్నాడు. తను ఎంపిక చేసుకున్న విషయంలో 15 పాయింట్లు, జెనరల్ నాలెడ్జ్‌లో 16 పాయింట్లు పొంది, ముగ్గురిని అధిగమించాడు. షోను కండక్ట్ చేసిన జె.ఆర్.ఆర్. టోల్కీన్, ''విజయానికి దోహదం చేసింది ఏమిటి?'' అని అడిగినప్పుడు, ''చదవడం, చదవడం, చదవడం,'' అని సమాధానమిచ్చాడు వర్గీస్. సైన్స్ ఫిక్షన్ రచించిన హెచ్.జి. వెల్స్, ఐజాక్ ఆసిమోవ్ అతడి అభిమాన రచయితలు.

**చందమామ క్విజ్ -2 (మార్చ్ '08) విజేతలకు అభినందనలు:**

1. సిరివరం మానసహారిణి, ముత్యంపేట - 505 331, కరీంనగర్ జిల్లా (ఆం.ప్ర)
2. వి.ఎన్. గాయత్రి, విద్యాధరపురం, కామకోటినగర్, విజయవాడ - 520 012 (ఆం.ప్ర)
3. డి. ప్రణవ్, రాజేశ్వరి వీధి, పెరంబూరు, చెన్నయ్ - 600 011 (త.నా)
4. భూమనపల్లె వెంకట సుబ్బారెడ్డి, సింహాద్రిపురం - 516 454, కడప జిల్లా (ఆం.ప్ర)
5. సి.హెచ్. గోపాలకృష్ణ, శ్రీరామ్‌నగర్, బ్రహ్మపూర్ - 760 002 (ఒరిస్సా)

## విజ్ఞానం...వినోదం...వికాసం ...

### విజ్ఞాన వీచికలు :

# జిగురు ప్రశ్న

టెఫ్లాన్ పూసిన పెనుముకు ఏదీ అతుక్కోదు. మరి టెఫ్లాన్ పెనుముకు ఎలా పూయబడుతుంది? టెఫ్లాన్ రసాయనికంగా దేనికీ అంటుకోదు. అయితే, సాంకేతికంగా దాన్ని అంచులకు హత్తుకునేలా చేయవచ్చు. ఈ వింత జిగట పదార్థాన్ని అమెరికాకు చెందిన శాస్త్రవేత్త డా రాయ్ ప్లంకెట్ కనుగొన్నాడు. 1938వ సం. ఆ శాస్త్రవేత్త కూలంట్ గ్యాస్ తయారుచేయడానికి ప్రయత్నిస్తూ, యాదృచ్ఛికంగా దీనిని కనుగొన్నాడు. ఈ వాయువుకోసం రకరకాల కలయికలను మిశ్రమాలను ప్రయత్నిస్తూ, రాత్రి ఆలస్యంకావడంతో కొన్ని రకాల గ్యాసుల కంటెయినర్‌లో అలాగే వదిలి వెళ్ళాడు. మరు నాడు ఉదయం వచ్చి చూస్తే వాయువులు ఆవిరైపోగా, రసాయనిక పదార్థాలలో అడుగున ఎంత ప్రయత్నించినా కదలని ఘనపదార్థం పేరుకుపోయి కనిపించింది. ... టెఫ్లాన్. ఇవాళ ప్రపంచవ్యాప్తంగా టెఫ్లాన్ పు ఉన్నది.



# ఫోటో వ్యాఖ్యల పోటీ


P. RAJALAKSHMI

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.


K. BALU



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జూలై 2008 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై, తేనాంపేట, చెన్నయ్ - 600 018

## అభినందనలు

మార్చ్ నెల పోటీ ఫలితాలు
శ్రీమతి అయ్యగారి బాల
భ.పే: జి.వి. రమణ
2-4-712, రోడ్ నంబర్. 5
న్యూ నాగోల్ కాలనీ,
హైదరాబాదు - 500 035
(అం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : భయపడకు నేస్తం!
రెండవ ఫోటో : బొమ్మ పాపకు సమస్తం!!

## సమాధానాలు :

. రాజస్థాన్‌లోని భరత్‌పూర్‌లో 2. టిబెట్ కొండ మేకలు 3. 25-30 యేళ్ళు 4. గుజరాత్‌లోని రాణ్ ఆఫ్ కఛ్ 5. కాశ్మీర్‌లో 6. ది లిటిల్ రాణ్ ఆఫ్ కఛ్‌లో.

**Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited,**
JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. **Editor : B. Viswanatha Reddi (Viswam)**

CHANDAMAMA (Telugu) May 2008 Registrar of Newspapers of India No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08






# బబ్బా సాహసాలు

పగిలిన ఫైర్ హైడ్రాంట్ దగ్గర ముగ్గురు పిల్లలు నీళ్ళల్లో గెంతులు వేయసాగారు.




లీకవుతున్న హైడ్రాంట్‌ను బాగు చేయడానికి వస్తున్న ప్లంబర్‌ను పిల్లలు గమనించలేదు.



వాళ్ళను అతడు అక్కణ్ణించి తరిమాడు.




అతడు తన పనిలో నిమగ్నుడయ్యాడు. పిల్లలు ముఖాలు వేలాడేసుకున్నారు.




బబ్బా కారు మీద కూర్చుని రావడం పిల్లలు చూశారు.




బబ్బా పిల్లల కేసి బుబాలూ ప్యాకెట్లు విసిరాడు. తానొక బబుల్ గమ్‌ను నోట్లో వేసుకున్నాడు.




బబ్బా కిందికి దూకి, బబుల్ ఊదాడు.




బబుల్ పగిలింది. అందులో నుంచి లేతఎరుపు బుగ్గ!




పిల్లల బబుల్ గమ్స్ నుంచి కూడా ఇప్పుడు జ్యూసీ మస్తీ బుగ్గలు పెల్లుబకసాగాయి!

